# మొదటిమాట

వృద్ధాప్యంవచ్చి వళ్ళు ముడతలుపడిపోతున్నా, పెళ్ళి పెళ్ళోఅని కలవరించి, యెంతధనమైనా గుమ్మరించి యవ్వనవతుల్ని వివాహమాడుతారు కోర్కెలు తీరక ముసలిభర్తలు తమతమ పాలబడినప్పుడు యెంతమంచిహృదయంగల స్త్రీకైననూ హృదయం సరియైన త్రోవతప్పి మారుత్రోవను పడుతూవుంటూంది! అప్పుడు లోకం ఆస్త్రీని నిందిస్తుంది! కాలం గడిచి కాటికికాళ్ళుసాచిన ముసలాయనకే ఇంకా అనుభవించాలని కోర్కెలువుంటే నూతన ప్రపంచకంలో కాలుపెడుతూన్నయవ్వనవతి కోర్కెలు వుండవా? ఆనవయువ్వని కోర్కెలు యెలా తీరేది?...! ఇహచదవండి.

ఇట్లు,

'కృత్తివెంటి'



# 1

'అదేం పెళ్ళే? శారదా! అంటూ వేళ్ళాడుతున్న వాలుజెడ ఎదురొమ్ములమీదవచ్చి పడేటట్లుగా పగలబడినవ్వుతూవచ్చింది శ్యామల.

'ఆఁ...ఆఁ పడేవ్ మందువాలో జాగ్రత్తగారా!'

'నాకు కనకం పెళ్ళి తలుచుకుంటే నవ్వు ఆగటం లేదు.' అంటూ వంకరలు తిరుగుతూ నవ్వటం మొదలుపెట్టింది శ్యామల.

'తరువాత నవ్వుదూగాని బట్ట తిన్నగా సర్దుకు కూర్చో శ్యామలా! వళ్ళు తెలియకుండా అంతనవ్వేమిటి?

'అదేమిటే శారదా! కనకం చివరకి అటువంటి ముసలితొత్తుని వరించి పెళ్ళిచేసుకుంది?'

'వాళ్ళవాళ్ళకి యిష్టమైంది మనకెందుకు ఆసంగతి. నీకెందుకు హాయిరాగా!'

'అదికాదుగాని ఆముసలితొత్తుని యెందుకు చేసుకున్నట్లే యిది. తల్లిదండ్రులకు యోచనలేకపోతే దీనికయినా అయ్యో ఈ ముసలి ముండాకొడుకుని చేసుకుని నేనేం సౌఖ్యపడతాను! నాకెందుకు యీ ముసలి మొగుడు అన్న మాటవుండవద్దూ! నామట్టుకు నాకు కనకం యీ పెళ్ళిచేసుకోటానికి యెట్లావప్పుకుందాఅని ఆశ్చర్యం కలిగింది. నిజంగా చెపితేనమ్ముతావో లేదోగాని శారదా! ఆపెళ్ళిజరుగుతున్న సమయంలో నాకు కనకం విషయంలో ఆయ్యోకనకం జీవితం అన్యాయంగా యీ ఒళ్ళంతా ముడతలుపడ్డ ముసలి ఆయన మెడకేశి కడుతున్నారేమాఅని నాకు యెంతో జాలికలిగింది.'

'పోనీ నువ్వు అంత జాలికలిగినదానవయితే కనకానికి ఆ పెళ్ళి అవకుండా తప్పించలేకపోయావ్?'

'ముట్టేదేమిటో మన యిద్దరికీ పెళ్ళిలోనే ముట్టిందిగా యింకా ముట్టేదేమిటి'

'మంగళహారతి పాడటానికి అంతసేపు పోయిరావ్ వద్దావేమిటి? నోటమాటరాకుండా!'

'పెళ్ళికొడుకుని చూసేటప్పటికి నాకు నవ్వాఆగలా! అంతమందిలో నుంచుని నవ్వితే ఏవనుకుంటారోఅని అప్పటికీ చాలాసేపు బిగపట్టుకు న్నాను. నవ్వు ఆపుకోవటం నాతరం కాలేదు'

'నిన్ను చూసి ఆయన మూర్ఛపోయాడు!'

'ఛీ...ఆయన ముఖం అసలునేను చూసేదానినిగాను నలుగురూ పాడూ పాడూ అని పట్టుపట్టారని వచ్చానుగాని లేకపోతే అసలు నే పాడేదానినా'

పాడినందుకు పళ్ళెంలో పదిరూపాయలు పెట్టాడుగా మంగళహారతి క్రింద'

'నువ్వే చవ్వున తీసుకున్నావుగాని లేకపోతేనా పెట్టవోయ్నాయు నమ్మా! అని ఇంకోపదిరూపాయలు ఘల్లునపడేయించేదానిని. సమయం అటువంటిది. నువ్వుతొందరపడ్డావు అటువంటి డాబుసరి మావయ్యల దగ్గరగుంజటానికి లెక్కఏమిటి!'

'మనంపాడినందుకు సంతోషంగా ఆయనకు తోచింది ఇచ్చాడు అంతే చాల్లెస్తూ'

'సరేగాని శారదా! మనం అక్కడనుంచుని మంగళహారతి పాడు తున్నంతసేపూ నువ్వు పాటధోరణిలోవున్నావా? వధూవరులవంకకూడా చూస్తున్నావా?'

'ఎందుకూ?'

'చెప్పు చెపుతా'

'పాటగాడవలో వున్నానుగాని అప్పుడప్పుడు అటువైపుకూడా చూస్తూనే వున్నాను ఏమిటిచెప్పు'

'ఆ పెళ్ళికొడుకు కళ్ళన్నీ ఎక్కడవున్నాయో చూశావా?'

'ఎక్కడఉన్నాయో చెప్పు'

'ప్రక్కనకూర్చున్న పెళ్ళికూతురుపైటపైనే వున్నాయి పెళ్ళికొడుకుకళ్ళన్నీ. పెళ్ళికూతుర్ని చూస్తూ తెగవుబ్బితబ్బిబ్బయిపోతున్నాడు తన పెళ్ళాన్ని తానుచూసుకున్నాడు మనకేం?'

'పోనీ అది సహజమే అనుకో, నేను అక్కడనుంచుని పాటపాడుతున్నానా ఏమిటో నాముఖంవంక తెగచూడటం మొదలుపెట్టాడు ముఖం వంకా, కుచ్చెళ్ళవంకా. ఒకచోట అన్నమాట ఏమిటి కాలిబొటనవ్రేలిదగ్గరనుంచి ఫాలభాగం వరకూ అదే, చూడడం అదేచూడటం నాకు మహాకోపంవచ్చింది. అక్కడ వుండటం యిష్టంలేక చప్పున యివతలకి వచ్చేశాను.

'............'

'కాలం అంతా తీరిపోయిన వాళ్ళకి యింతకోరికలయితే పెళ్లియీడుకొచ్చిన పిల్లలకి, యువ్వనులకి యెన్నెన్ని కోరికలు వుంటాయి. అన్నిదశలూ అనుభవించినవారికే యింకాకోరికలు తీరకపోతే ఇప్పుడిప్పుడే నూతనప్రపంచంలో కాలెట్టబోతున్న లేతప్రాయంగలవారికి ఎన్నికోరికలువుంటాయి! అన్నజ్ఞానం ఆముసలి మొద్దుపుకు వుండవద్దా అని నాపట్టుదల! ఇటువంటి పెళ్ళిళ్లు జరిగితే ఎంతమంచి ప్రవర్తనకలవారైనా తప్పక చెడుమార్గంలో పడితీర్తారు. మంచివారికిమటుకు కోరికలు అంటూవుండవా? భర్తలు యిటువంటివారైనపుడు వారికోరికలు ఎలా గట్టెక్కుతాయి'

'కనకం చాలామంచిది శ్యామలి'

'మంచిదే, కాదని చెప్పటంలేదు. కనకానికి తగినమొగుడు దొరికినప్పుడుగాని మంచితనం రాణిస్తుంది. అదిలేక ముసతలు చట్టుకుపోనే

మొగుడుదొరికినప్పుడు దానిమంచితనం అంతా మాయమయిపోతుంది. కనకంమటుకు ఆడజన్మ యెత్తలా! కోరికలు అంటూ దానిమటుకులేవా? ఏంమాటలు చెపుతావు. శారదా! ప్రపంచంవంక ఒక్కసారి పార చూడు అన్నిసంగతులూ అప్పడే తెలుస్తాయి నీకు' అని శ్యావలి చెపు తూవుండగానే శారదతల్లి అక్కడకువచ్చింది.

'ఏమిటి శ్యావలీ! చెవుతున్నావు చాలాసేపటినుంచి'

'ఏంలేదు పిన్నీ! మా ముసలాయన పెళ్ళిసంగతినిగురించి పెండ్లి ముచ్చట్లు చెప్పుకుంటూన్నాము' అంది శ్యావలి నవ్వుతూ.

'లోకనాధంగారి పెళ్లినిగురించా యిందాకటినుంచి నువ్వుచెప్పే దంతా ఏమేమిటో చెప్పుకుంటున్నారు నేను సరిగా వినలేదు ఆయన కేమిటి కనకాన్ని యివ్వటమేమిటి? ఈపెళ్లికి తల్లిదండ్రులు ఎట్లాఒప్పు కున్నారో! నాకు ఆశ్చర్యమౌతుంది ఆపెళ్ళిసంగతి' అంది ముక్కుపైన వేలేసుకుని శారదతల్లి.

'పిన్నీ! నేను ఒక్కమాట చెపుతావిను. ప్రపంచంఅంతాడబ్బు తోటి మంచిచెడ్డలవిచక్షణఅక్కరలేదు. మనఅమ్మాయికీ ఆఅబ్బాయికి ఈడూజోడూ కుదురుతుందాఅన్నఆలోచనలుఏమీ అక్కరలేదుసంచులు కొస్తేసరిఎంతెంత పనులైనా క్షణాలోఅయిపోతాయి. కనకంమీదమోజు వుందిట ఆయనకు. తల్లిదండ్రుల ఒళ్ళో మూటపుమ్మరించాడు! పుస్తె ముడివేశాడు. కనకాన్ని నాలుగోపెళ్ళి చేసుకున్నాడు. సిగ్గులేక నేనూ ఒక పెళ్ళికొడుకునే అంటూ వచ్చికూర్చున్నాడు'

'నీకెందుకంట యింతకోపం?'అంది శారద.

'స్నేహితురాలిజీవితం అధోగతి పాలవుతూంటే చూడ కష్టానికి ష్టంగా వుండదూ! శారదా! చూడు యీసంసారం ఏమవుతుందో వరికి' అంది శ్యావలి. అంతలోనే శారదతల్లి.

'శారదా! ఏమిటి? ఆజెడానువ్వూ! నూనెరాచుకుని జెడవేసుకో రాదూ పూరికే కూర్చోకపోతే. కబుర్లువినమను ఎన్ని రాత్రులయినా వినుకూవిరామం లేకుండా వింటుంది—తన వంటిశుభ్రత తాను చూసు కోవటంకూడా బద్ధకమే, యిటాగ్రి జెడవేస్తాను'

---

## 2

'లోకనాధంగారు వున్నారండీ?' అన్నాడు గోపాల్‌రావ్ వీధి గుమ్మంలో నిలుచున్న కనకంతో—

'లేరండీ. ఎక్కడికో వెళ్ళారు' అంది గోపాల్‌రావ్ వంక వాల్చూపులు చూస్తూ సిగ్గు అభినయిస్తూ. కనకం వాల్చూపులూ, మాటల వైఖరిచూస్తున్న గోపాలరావుకి కనకం తనను ప్రేమిస్తున్నట్లుగా తలిచాడు. కనకంతో యేవోమాటలు కల్పించుకుని కొంతసేపు మాట్లాడదామనుకున్నాడు.

'ఎక్కడికివెళ్ళారో మీకు తెలుసునా?'

'తెలిస్తే యెక్కడికోవెళ్ళారని ఎందుకుచెపుతాను మీతో?' అంది నవ్వుతూకనకం.

'సరే అయితే మళ్ళావస్తాలెండి' అని వెళ్ళబోతున్న గోపాలరావుతో—

'ఎవరువచ్చారని చెప్పమన్నారూ? మళ్ళా వెనకకుతిరిగాడు గోపాలరావు'

'ఎందుకు నేను వస్తానుగాదండీ'

'చెపితే ఫలానివారువచ్చి వెళ్ళారు అని ఆయనతో చెప్తాను'

'గోపాలరావ్ మీకోసంవచ్చాడు అని చెప్పండి' అని వెళ్తుతూ మళ్ళావస్తాలెండిఅంటూ వెనకవైపు ముఖంపెట్టి అన్నాడు కనకంముఖం వంక చూస్తూ.

'పాపం! కనకానికి భర్తవలన యేసౌఖ్యమూ లేదు. యవ్వన దశలోవున్న కనకం జీవితం నిర్జీవంగాగడిచిపోతోంది. కనకంమాత్రం ఆడజన్మవ త్తలేదా? కనకంకోరికలు యెలానెఱవేరేది? కనకం చాలా సౌభాగ్యవంతురాలు! కాని భర్త ఇటువంటివాడవటంవలన జీవితంలో సౌఖ్యం అనేది దక్కటంలేదు. ఎంత మంచిపత్రివ్రతకలదిఅయితేమటుకేం మంచి దానికిమటుకు కోర్కెలుఅంటూ వుండవా? భర్తతో అణుమాత్రం సుఖంలేకపోవటంవలన కనకంహృదయం పరపురుషునిమీదకు పరుగు లెత్తుతోంది. తనకు యీడూ, జోడూ కలిగిన పురుషునిచూచినప్పుడు మనసులో అంతులేని ఆనందంకలుగుతూవుంటుంది. ఆమెమనసు ఆమెకే స్వాధీనంకావటంలేదు—మొదటనుంచీ కనకంపత్రివ్రతన మంచిదే, అయిన పెళ్ళివలనా, పుస్తెకట్టిన ముదుసలిమొగుడువలనా, తనకు యేవిధమైన ప్రపంచకసౌఖ్యములూ దక్కకపోనటంవలనా, యిట్టిపరిస్థితులవలన కనకం మనసు కోర్కెలతోనిండి నానాటికి మంచిహృదయం, అనుకోనిమార్పు చెందుతోంది—వాలుజెడ వేసుకొని తోటలోనున్న రకరకాలపువ్వులూ చెందంగాగుచ్చుకుని వాలుజెడలో వ్రేలాడకట్టుకుని గులాబిరంగు బెనారస్‌చీర కట్టుకుని, సిల్కుపువ్వుల రెవిక ఆరెవికలో తెల్లసిల్కు సన్నని బాడీ తొడుక్కుని పసిడిబొమ్మలాగా తయారయి! సావిట్లో సోఫాపైన వీధికెదురుగాకూర్చుని వచ్చేపోయే నవయువకులనూ, యవ్వనవతులనూ చూస్తూకూర్చుంది. యీనాయవ్వనాన్నీ, యీఅందాన్ని అనుభవించే దెవరు? నేను యింతఅందంగా యెందుకు అలంకరించుకోవటం! యెవరి కోసం, యెవరితో సుఖపడటంకోసం? యెవరిని సుఖపెట్టటంకోసం? నా యవ్వనప్రాయమంతా అడవినికాచిన వెన్నెలలాగా వ్యర్థమైపోవలసిం దేనా? ఒకరితో సుఖపడలేనీ, ఒకరిని సుఖపెట్టలేనీ ఈ నాఆడబ్రతుకూ, ఆడస్వరూపం ప్రపంచకంలోవుండేం, వుండకేం బ్రతికివున్నా లేనివారితో పాటే! ఎందుకొచ్చినజీవితం యిది. గోపాలరావ్ అన్నా యిటువంటి

సమయంలోవస్తే బాగుండునే సరదాగా కొంతసేపు యిరువురంకలిసి మాట్లాడుకోవచ్చుఅని యేమిటో తనలోతాను అనుకుంటూ ఆలోచించు కుంటూవుంది. అంతలోనే బండివచ్చి ఇంటిముందు ఆగింది—అందులో నుంచి దిగివచ్చాడు ఓల్డుబోయ్! లోకనాధంగారు ముసలిమొగుణ్ని చూచేటప్పటికి కనకానికివున్న సరదాకూడా చచ్చిపోయింది.

'మీకోసం యెవరోవచ్చి పోయారండీ' అంది రంభలాగ యెదురుగావెళ్ళి కనకం. కనకాన్ని చూచి నవ్వుకళ్ళు మిరుమిట్లు గొల్పుతాయి లోకనాధంగారికి. భార్యా అందచందాలనుచూచి మురిసి పోతూవుంటాడు. బంగారపుబొమ్మ కదిలివస్తోందా అన్నట్లుగావుంది.

'ఎప్పుడువచ్చారు?'

'మీరువెళ్ళిన కొంతసేపటికి వచ్చారు'

'ఎన్నేళ్ళుంటాయి ఆయనకు?'

'సుమారు ముప్ఫై వుండవచ్చును'

'పేరు తెలుసుకోకపోయావా?'

'అడిగాను గోపాలరావుగారని చెప్పారు'

'యింకాయేం. ఆమాటచెప్పక యెవరోవచ్చారని చెప్తావేం? అన్నీ వివరంగానే తెలుసుకున్నావా నువ్వేఅడిగావా గోపాలరావుని, యెవరితోనైనా అడిగించావా?'

'నేను వీధిగుమ్మంలో లోపలగా నుంచున్నాను, ఆయనవచ్చి మీపేరుచెప్పి వున్నారా అని అడిగారు'

'అదే నిన్నేఅడిగాడా అంటున్నాను'

'నన్నేఅడిగారు. లేరనిచెప్పాను'

'నాతో యేంపనివుంది అతనికి'

'యేదో అవసరంపనిమీదే వచ్చినట్లుగా వున్నారు'

'అతనితో నువ్వెందుకు మాట్లాడటం, యెవరిచేతనైనా లేరని చెప్పించలేవూ?'

'యెవరున్నారని చెప్పించనూ'

'పోనీ లేరనిచెపితే పోదూ. గోపాలరావుతో యెందుకు ఇంతసేపి ఇంటికివచ్చినవారితో అల్లా బాతాఖానీ వేసుక్కూర్చోవటమేనా పని! వచ్చినపని యేమిటోకూడా అడిగావా'

'నాకేం చెప్పలేదు మళ్ళావస్తాలెండి అని వెళ్ళిపోయారు'

'యిహానుంచి నాకోసం యింటికి యెవరొచ్చినాసరే నువ్వమటుకు వారితో మాట్లాడకు' అని చెప్పి గదిలోకి వెళ్ళిపోయాడు లోకనాథం గారు—గోపాలరావుని కలుసుకొని నాతో యేదైనాపనివుంటే బైట యెక్కడైనా కలుసుకుని మాట్లాడు అని చెప్పి యింటికి రాకుండా చేదామనుకున్నాడు.

---

## 3

లోకనాథంగారు గోపాలరావు తనయింట్లోలేనిసమయంలో వచ్చి కనకంతో మాట్లాడినందువలన మనసుకి యేదోకొంత అనుమానంతట్టి మరునాడు గోపాలరావును కలుసుకుని యింటికిరాకుండా కట్టుదిట్టం చేశాడు. గోపాలరావు లోకనాథంగారితో ఎంతఅవసరమైనపని వచ్చినా బైట, బైట కలుసుకుని మాట్లాడటం మొదలుపెట్టాడు. లోకనాథం గారి అంతరంగికం తెలుసుకుని. గోపాలరావ్ తిరిగి యెప్పుడూ లోక నాథంగారి యింటికి రాకపోవటంవల్ల తనకూ గోపాలరావుకీ జరిగిన సంభాషణ గోపాలరావుగారు వచ్చారనీ, యెందుకు భర్తతో చెప్పానా అనుకుంది కనకం మనసులో. ఆయన్ని రాకుండా తనభర్తయే చేసి వుంటాడు అనుకుంది. మొదట చెయ్యటం పొరపాటుచేశాను. నా తెలివి

తక్కువచేతనే గోపాలరావుగారు పూరల యింటికి రాకండాజరగటం అయింది అనుకొని గుంభనగా మళ్ళా ఆయనసంగతే భర్తతో యెత్త కుండా వూరుకుంది. సుమారు సాయంత్రం నాలుగుగంటలు కావస్తోంది. వీధివైపునవున్న గదిలోనికివచ్చి నిలువుటద్దంలో చూచుకుంటూ జడ అల్లుకుంటోంది కనకం. జడఅల్లుకుంటూ గదికి ప్రక్కవైపుగావున్న కిటికీలోనుంచి వీధివైపుచూస్తోంది. లోకనాథంగారి యింటిప్రక్కగా వున్న స్కూలులో టీచర్‌గావుంటూన్న కళాధరరావు విశ్రాంతి సమయంలో తనప్రయివేట్‌రూమ్‌లో టేబుల్‌మీద కాళ్ళు చాపుకుని కుర్చీలోపడుకొని యేదోపుస్తకం చూచుకుంటున్నాడు. అప్రయత్నంగా కనకంచూపు స్కూలురూమ్‌లోవున్న కళాధరరావుపైన వాలింది. రెప్ప వాల్చకుండా కళాధరరావువంక చూస్తోంది. కళాధరరావునిచూస్తూన్న కనకానికి హృదయంలో అనేకవిధములయిన ఆశలు మొలకలెత్తు తున్నాయి. జెడఅల్లుకోవటం అయిపోయింది. కళాధరరావువంకచూస్తూ అద్దానికి యెదురుగానిలుచుని తలలో గులాబిచెండు పెట్టుకుంటోంది. కళాధరరావు టేబుల్‌మీద కాళ్లుదింపి చేతినున్న హేండ్‌వాచి చూచి పుస్తకంమూసేసి లేవబోతూ లోకనాథంగారి ఇంటివైపు చూశాడు. రెండుచేతులూయెత్తి తలలో గులాబిచెండు పెట్టుకుంటూ తనవంక యేకదృష్టిగాచూస్తూన్న కనకాన్ని చూశాడు. లేచి క్లాసులోకి వెళ్ళ బోతున్నవాడు కనకాన్నిచూస్తూ రెప్పవాల్చకుండా శిలాప్రతిమలాగా అలాగే నిలబడిపోయాడు. కళాధరరావు తనవంక చూడటం గ్రహిం చింది కనకం! కళాధరరావు చూపులో తనచూపుకూడా కలిపింది. కళా ధరరావుకీ కనకానికీ, చూపులుకలిశాయి. అంతలోనే పానకంలో పుల్ల లాగా మాష్టరుగారు యేవేళకీరాలేదని క్లాసుకుర్రాడు మాష్టరుగారూ! అంటూ ధబాలున గదితలుపులు తోసుకుంటూ వచ్చాడు—కళాధర రావు వకసారి మళ్ళా కనకంవంకచూచి క్లాసుకి వెళ్ళిపోయాడు! కళాధర

రావు వెళ్ళిపోగానే గదికిటికీలువేసి యింట్లోకివెళ్ళింది కనకం. అప్పుడే యేదోపనిమీద వెళ్ళివచ్చాడు లోకనాథంగారు-గదిలోపడుకుని పాటలు పాడుకుంటోంది కనకం! లోకనాథంగారు గదిలోకివచ్చారు. భర్తను చూచి గభాలునలేచింది.

'వెళ్ళినపని అయిందా?' అంది భర్తతో—

'కొంతవరకు అయింది ఇంకా పూర్తిగాకాలేదు'

'మనబాకీ మనకి యివ్వటానికి ఇంత అవస్థపెడతారెందుకు?'

'వాళ్ళముఖం వాళ్ళు మనని అవస్థపెట్టేదేమిటి! పిల్లలుకలవాళ్ళు వునూరుమని యేడ్చిపోతారని చూస్తూన్నానుగాని లేకపోతే రేపు యీపాటికి మూడుకోర్టులూ తిప్పి ముప్పతిప్పలాపెట్టి మూడు చెఱువుల నీళ్ళుతాగించలేకపోయానా?'

'ఇంతకీ యేమంటాడు అతను?'

'ఇవాళ తీర్మానంచేసి యేదుస్తానన్నాడు. అతనికోసమే వెళ్ళి వచ్చాను పనికాలేదు. మళ్ళావెళ్ళాలి'

'యేం! యింట్లోలేడా?'

'లేకపోవటమేమిటా! వున్నాడు. డబ్బుకోసమై ఎవరినో పంపించాడట ఆమనిషి ఇంకారాలేదట'

'వాళ్ళఇంటిచుట్టూతిరిగే అవసరం మనకేమిటి?'

'అవుననుకో, ఇవాళ ఒకరోజూ చూచి ఇవాళకూడా వాడు డబ్బుఇవ్వకపోతే ఇహ వాళ్ళగుమ్మం తొక్కవలసిన పనేలేదు. యెట్లా రాబట్టుకోవాలో అట్లాగే రాబట్టుకుందాం'

'అయన మనని యేంచేస్తాడూఅన్న ధీమాగావున్నట్లుగావుంది అతనికి'

'మనమేంచేస్తామూ. ఇల్లు వాకిళ్ళూ, చెంబూ, తప్పేలా బైట పడేసి వేలాంపాడించేటప్పుడే తెలుస్తుంది'

'అప్పుడుగాని వదలదు అటువంటివాళ్ళ పొగరు అట్లాగే చెయ్యాలి మొండివాళ్ళకి'

'ఇవాళ వ్యవహారం పైసలుచెయ్యకపోతే వాళ్ళఖర్మం అంతే అవుతుంది. అప్పుడు దమ్మిడితీసెయ్యమంటే తీసేస్తానా! అది వట్టిమాట యింతకింత ఖర్చులుకూడా మీదపడతాయి. అసలు మునిగి వూరు కుంటారు—పోనీ మనమేంచేస్తాం. అవంకెన వుత్తర్యం యిట్లా యియ్యవే'

'మళ్లా వెళతారా యిప్పుడు?'

'ఊఁ...యివాళ్ళ యేదోతేల్చేస్తాను'

'ఇదుగో' అంటూ ఓవుత్తరంగ్య భర్తచేతికి యిచ్చింది కనకం—

'మంచినీళ్ళు యివ్వవే'

'ఇవిగోనండీ' అని గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చియిచ్చింది—

'ఊఁ వెళుతున్నాను. నాకోసము యెవరైనావస్తే పేరిగాడిచేత వాళ్ళయింటికి రమ్మనమని చెప్పించు. యెవరూ రారులే అయినా చెప్తు తున్నాను. తలుపులేసుకో' అనిచెప్పి లోకనాథంగారు వ్యవహారపనిమీద వెళ్ళిపోయారు. స్కూలు విడిచిపెట్టేవేళ కావొస్తుంది. మళ్ళాఆయన నాకోసం చూస్తూకూర్చుంటారేమో ఎప్పుడు చప్పున వెళతాడో భర్త అని ఎదురు చూస్తోంది. కనకం భర్త వెళ్లిపోగానే వీధి తలుపులువేసి పాటలుపాడుకుంటూ సంతోషంగా వీధిగదిలో పచార్లుచేస్తోంది. ఇంకా స్కూలు వదిలిపెట్టటానికి టైమువున్నది అనుకొని పడక గదిలోకి వెళ్ళి పడుకుంది. కళాధరరావు కనకం చూపులు కురిసినప్పటినుంచి, ఎందు చేతనోగాని పట్టరాని సంతోషంగావుంది కనకానికి. గోపాలరావు మొదట నాకళ్ళముందు మెరిశాడు. ఆయన విషయంలో కొంత ఆశ కలిగిందినాకు. నా ఆశాలతను మొదట్లోనే భగవంతుడు త్రెంచేశాడు. అశ, నిరాశ అయింది. యీయన చక్కని అందగాడు. పైగా సంపాదన పరుడు. నాఅదృష్టంవల్ల ఈవాళ ఆయన నాకంటబడ్డారు. ఆయన్ను

రావు వెళ్ళిపోగానే గడికిటికీలువేసి యింట్లోకివెళ్ళింది కనకం. అప్పుడే యేదోపనిమీద వెళ్ళివచ్చాడు లోకనాథంగారు-గదిలోపడుకుని పాటలు పాడుకుంటోంది కనకం! లోకనాథంగారు గదిలోకివచ్చారు. భర్తను చూచి గభాలునలేచింది.

'వెళ్ళినపని అయిందా?' అంది భర్తతో—

'కొంతవరకు అయింది ఇంకా పూర్తిగాకాలేదు'

'మనబాకీ మనకి యివ్వటానికి ఇంత అవస్థపెడతారెందుకు?'

'వాళ్ళముఖం వాళ్ళు మనని అవస్థపెట్టేదేమిటి! పిల్లలుకలవాళ్లు వుసూరుమని యేడ్చిపోతారని చూస్తూన్నానుగాని లేకపోతే రేవు యీపాటికి మూడుకోర్టులూ తిప్పి ముప్పతిప్పలాపెట్టి మూడు చెఱువుల నీళ్ళుతాగించలేకపోయానా?'

'ఇంతకీ యేమంటాడు అతను?'

'ఇవాళ తీర్మానంచేసి యేడుస్తానన్నాడు. అతనికోసమే వెళ్ళివచ్చాను పనికాలేదు. మళ్ళావెళ్ళాలి'

'యేం! యింట్లోలేడా?'

'లేకపోవటమేమిటీ! వున్నాడు. డబ్బుకోసమై ఎవరినో పంపించాడట ఆమనిషి ఇంకారాలేదట'

'వాళ్ళఇంటిచుట్టూతిరిగే అవసరం మనకేమిటి?'

'అవుననుకో, ఇవాళ ఒకరోజూ చూచి ఇవాళకూడా వాడు డబ్బుఇవ్వకపోతే ఇహ వాళ్ళగుమ్మం తొక్కవలసిన పనేలేదు. యెట్లా రాబట్టుకోవాలో అట్లాగే రాబట్టుకుందాం'

'ఆయన మనని యేంచేస్తాడూఅన్న ధీమాగావున్నట్లుగావుంది అతనికి'

'మనమేంచేస్తామా. ఇల్లు వాకిళ్ళూ, చెంబూ, తప్పేలా బైట పడేసి వేలాంపాడించేటప్పుడే తెలుస్తుంది'

'అప్పుడుగాని వదలడు అటువంటివాళ్ళు పొగరు అట్లాగే చెయ్యాలి మొండివాళ్ళకి'

'ఇవాళ వ్యవహారం పైసలు చెయ్యకపోతే వాళ్ళఖర్మం అంతే అవుతుంది. అప్పుడు దమ్మిడీతీసెయ్యమంటే తీసేస్తానా! అది వట్టిమాట యింతకింత ఖర్చులుకూడా మీదపడతాయి. అసలు మునిగి పూరు కుంటారు—పోనీ మనమేంచేస్తాం. ఆవంకెన వుత్తర్యం యిట్లా యియ్యవే'

'మళ్లా వెళతారా యిప్పుడు?'

'ఊఁ... యివాళ్ళ యేదోతేల్చేస్తాను'

'ఇదుగో' అంటూ ఓవుత్తర్యం భర్తచేతికి యిచ్చింది కనకం—

'మంచినీళ్ళు యివ్వవే'

'ఇవిగోనండీ' అని గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చియిచ్చింది—

'ఊఁ వెళుతున్నాను. నాకోసము యెవరైనావస్తే పేరిగాడిచేత వాళ్ళయింటికి రమ్మనమని చెప్పించు. యెవరూ రారులే అయినా చెప్తు తున్నాను. తలుపులేసుకో' అనిచెప్పి లోకనాథంగారు వ్యవహారపనిమీద వెళ్ళిపోయారు. స్కూలు విడిచిపెట్టేవేళ కావొస్తుంది. మళ్ళాఆయన నాకోసం చూస్తూకూర్చుంటారేమో ఎప్పుడు చప్పున వెళతాడో భర్త అని ఎదురు చూస్తోంది. కనకం భర్త వెళ్లిపోగానే వీధి తలుపులువేసి పాటలుపాడుకుంటూ సంతోషంగా వీధిగదిలో పచార్లుచేస్తోంది. ఇంకా స్కూలు వదిలిపెట్టటానికి టైమువున్నది అనుకొని పడక గదిలోకి వెళ్ళి పడుకుంది. కళాధరరావు కనకం చూపులు కురిసినప్పటినుంచి, ఎందు చేతనోగాని పట్టరాని సంతోషంగావుంది కనకానికి. గోపాలరావు మొదట నాకళ్ళముందు మెరిశాడు. ఆయన విషయంలో కొంత ఆశ కలిగిందినాకు. నా ఆశాలతను మొదట్లోనే భగవంతుడు త్రెంచేశాడు. ఆశ, నిరాశ అయింది. యీాయన చక్కని అందగాడు. పైగా సంపాదన పరుడు. నాఅదృష్టంవల్ల ఈవాళ ఆయన నాకంటబడ్డారు. ఆయన్ను

రావు వెళ్ళిపోగానే గదికిటికీలువేసి యింట్లోకివెళ్ళింది కనకం. అప్పుడే యేదోపనిమీద వెళ్ళివచ్చాడు లోకనాథంగారు-గదిలోపడుకుని పాటలు పాడుకుంటోంది కనకం! లోకనాథంగారు గదిలోకివచ్చారు. భర్తను చూచి గభాలునలేచింది.

'వెళ్ళినపని అయిందా?' అంది భర్తతో—

'కొంతవరకు అయింది ఇంకా పూర్తిగాకాలేదు'

'మనబాకీ మనకి యివ్వటానికి ఇంత అవస్థపెడతారెందుకు?'

'వాళ్ళముఖం వాళ్ళు మనని అవస్థపెట్టేదేమిటి! పిల్లలుకలవాళ్లు వున్నూరుమని యేడ్చిపోతారని చూస్తూన్నానుగాని లేకపోతే రేపు యీపాటికి మూడుకోర్టులూ తిప్పి ముప్పతిప్పలాపెట్టి మూడు చెఱువుల నీళ్ళుతాగించలేకపోయానా?'

'ఇంతకీ యేమంటాడు అతను?'

'ఇవాళ తీర్మానంచేసి యేదుస్తానన్నాడు. అతనికోసమే వెళ్ళి వచ్చాను పనికాలేదు. మళ్ళావెళ్ళాలి'

'యేం! యింట్లోలేడా?'

'లేకపోవటమేమిటి! వున్నాడు. డబ్బుకోసమై ఎవరినో పంపించాడట ఆమనిషి ఇంకారాలేదట'

'వాళ్ళఇంటిచుట్టూతిరిగే అవసరం మనకేమిటి?'

'అవుననుకో, ఇవాళ ఒకరోజూ చూచి ఇవాళకూడా వాడు డబ్బుఇవ్వకపోతే ఇహ వాళ్ళగుమ్మం తొక్కవలసిన పనేలేదు. యెట్లా రాబట్టుకోవాలో అట్లాగే రాబట్టుకుందాం'

'ఆయన మనని యేంచేస్తాడూఅన్న ధీమాగావున్నట్లుగావుంది అతనికి'

'మనమేంచేస్తామూ. ఇల్లు వాకిళ్ళూ, చెంబూ, తప్పేలా బైట పడేసి వేలాంపాడించేటప్పుడే తెలుస్తుంది'

'అప్పుడుగాని వదలదు అటువంటివాళ్ళ పొగరు అట్లాగే చెయ్యాలి ముండావాళ్ళకి'

'ఇవాళ వ్యవహారం పైసలు చెయ్యకపోతే వాళ్ళఖర్మం అంతే అవుతుంది. అప్పుడు దమ్మిడీతీసెయ్యమంటే తీసేస్తానా! అది వట్టిమాట యింతకింత ఖర్చులుకూడా మీదపడతాయి. అసలు మునిగి వూరు కుంటారు—పోనీ మనమేంచేస్తాం. ఆవంకెన వృత్తర్యం యిట్లా యియ్యవే'

'మళ్లావెళతారా యిప్పుడు?'

'ఊఁ...యివాళ్ళ యేదోతేల్చేస్తాను'

'ఇదుగో' అంటూ ఓవృత్తరం భర్తచేతికి యిచ్చింది కనకం—

'మంచినీళ్ళు యివ్వవే'

'ఇవిగోనండీ' అని గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చియిచ్చింది—

'ఊ వెళుతున్నాను. నాకోసము యెవరైనావస్తే పేరిగాడిచేత వాళ్ళయింటికి రమ్మనమని చెప్పించు. యెవరూ రారులే అయినా చెప్తు తున్నాను. తలుపులేసుకో' అనిచెప్పి లోకనాథంగారు వ్యవహారపనిమీద వెళ్ళిపోయారు. స్కూలు విడిచిపెట్టేవేళ కావొస్తుంది. మళ్ళాఆయన నాకోసం చూస్తూకూర్చుంటారేమో ఎప్పుడు చప్పున వెళతాడో భర్త అని ఎదురు చూస్తోంది. కనకం భర్త వెళ్లిపోగానే వీధి తలుపులువేసి పాటలుపాడుకుంటూ సంతోషంగా వీధిగదిలో పచార్లుచేస్తోంది. ఇంకా స్కూలు వదిలిపెట్టటానికి టైమువున్నది అనుకొని పడక గదిలోకి వెళ్ళి పడుకుంది. కళాధరరావు కనకం చూపులు కురిసినప్పటినుంచి, ఎందు చేతనోగాని పట్టరాని సంతోషంగావుంది కనకానికి. గోపాలరావు మొదట నా కళ్ళముందు మెరిశాడు. ఆయన విషయంలో కొంత ఆశ కలిగిందినాకు. నా ఆశాలతను మొదట్లోనే భగవంతుడు త్రెంచేశాడు. ఆశ, నిరాశ అయింది. యీాయన చక్కని అందగాడు. పైగా సంపాదన పరుడు. నాఅదృష్టంవల్ల ఈవాళ ఆయన నాకంటబడ్డారు. ఆయన్ను

చూసి నాహృదయం పొంగిపోతోంది. భగవంతుడు అటువంటి వానిని నాకుభర్తగా కూరిస్తే నా జీవితం ఎంతబాగుండేది. నేను ఆయన్ని కిటికీ లోనుంచి చూస్తూన్నప్పుడు కుర్చీలోనుంచి లేచి వెళ్ళబోతూ నన్ను చూసి, నాచల్లచల్లని చూపులనుచూసే రాతిబొమ్మలాగా నా చూపులతో చూపులుకలిపిచూస్తూ నిలబడిపోయాడు. మూడు అడుగులు వెయ్యలేక నాకు ఆయనయందు ప్రేమ కలిగినట్లే నా అందచందాలను చూసి ఆయన నన్ను ప్రేమిస్తున్నాడు. నాకుయిటువంటి ముసలిమొగుణ్ణి అంటకట్టి నాకు ఘోరమైన అపకారంచేసినా తిరిగి యిప్పుడు నాకోరికలు తీరేసమయం. నువ్వు యీ ప్రపంచకంలో సుఖపడేసమయం వచ్చింది. అని ఆయన్ని నాకు చూపి, నాకుపకారం చేశాడు భగవంతుడు. ఎక్కడికి అక్కడే సంతోషించాలి. వెంకటి గోపాలరావు నిలాగే తెలివితక్కువచేత, చేతపడిన పండుని చేతులారా వదులుకోకుండా ఈయన విషయం మనసులో గుంభనగా వుంచుకుని ఈయనను దక్కించుకునే వుపాయం చేస్తాను. రోజులు మంచివయితే నాటంతటఅదే దొర్లుకువస్తాయి. సుఖాలు. ఆయనకీ నాకూమాటలు ఎప్పుడు కలుస్తాయో! ఆయనతో ఎప్పుడు మనసు విప్పి కులాసాగా మాట్లాడుతానో, మమ్మల్ని ఇద్దరిని భగవంతుడు ఎప్పుడు కలప దలుచుకున్నాడో, ఆరోజు యెప్పుడు దొర్లుకువస్తుందోగదా!' అని అనుకుంటూ మనసులో కళాధరరావుని నిలుపుకుని ఏమేమిటో కోర్కెలు పెంచుకొంటోంది కనకం. కనకానికంటె ఎక్కువ ఆరాటంగావుంది కళాధరరావుకి కనకం గదిలోనుంచుని స్కూలు గదిలోవున్న తనవంక అంత ఇదిగా చూడటంవల్ల కళాధరరావు కనకం మంచి అందంగల మనిషి గనుక అటువంటిది తనవంక ప్రేమిస్తున్నట్లుగా చూడటంవల్ల కళాధరరావు మనసుమనసులో లేదు. కనకంతో పరిచయం కలుగజేసుకునేది యెట్లాగా! కనకాన్నిపొందేది ఎట్లాగా! అనేఆలోచనలతో ఆయన మనసుకల్లోలం అవుతోంది. తప్పనిసరిగా క్లాసుకి

వచ్చాడుగాని లేకపోతే కనకాన్ని చూస్తూ తనకి తోచిన పద్ధతిని తానూ కనకానికై ప్రయత్నిస్తూ తన రూమ్‌లోనే కూర్చొనేవాడు. కనకంతో పరిచయం ఎప్పుడా! ఎప్పుడా! అని ఎంతో ఆతురతతో ఎదురుచూస్తున్నాడు కళాధరరావు స్కూలు టైములయిపోయింది. గణ,గణమని గంటకొట్టారు. పిల్లలందరూ గొల్లున గోలచేస్తూ పరుగు లెత్తుతున్నారు. ఆటలకై పోయేవారు ఆటలోకిపోతున్నారు. కళాధర రావు తన ప్రయివేట్ రూమ్‌లోకివచ్చాడు. స్కూలు గంటవిని కళా ధరరావుకంటే ముందుగానే వీధిగదిలోకివచ్చి కిటికీరెక్కలుతీసి కళాధర రావుకోసం చూస్తోంది కనకం. తనను ప్రేమిస్తూ తనవంక వాలు చూపులుచూస్తూన్న కనకాన్ని చూచాడుకళాధరరావు. తనవంక ఆశతో చూస్తూన్న కళాధరరావునుచూచింది. కనకం చల్లచల్లనివాల్చూపులతో ఇరువురూఇరువై నిమిషాలవరకూచిరునవ్వులతో ఒకరిపైనఒకరుఆశలు పెట్టు కున్నట్లుగా చూసుకున్నారు. అంతలోనే రంగడు గభాలున తలుపు త్రోసుకునివచ్చాడు.

'మేష్టరుగారూ! నాపుస్తకం యివ్వరూ' అంటూ.

'నీపుస్తకం నాదగ్గరవుందా?'

'అవునండి ఇందాక క్లాసులో తీసుకోలేదండీ మీరూ!'

'ఏం పుస్తకం?'

'హిస్టరీ బుక్కండి'

'ఎక్కడ పెట్టానురా?' అంటూ కనకంవంక చూస్తున్నాడు,

'ఇదుగోనండి మేష్టారుగారూ! అంటూ డ్రాయరుమీాద బుక్కు తీసుకున్నాడు.

'ఇదేనా నీబుక్కు అయితే తీసుకో'

'అప్పుడే మరచిపోతారండి?'

'నాకు ఈవాళ మనసు సరిగాలేదు రంగా'

'క్లాసులోకూడా సరీగా చెప్పలేదండీమీరు'

'మతిపోయినట్లుగావుంది నాకు ఈవేళ'

'నేవెళుతున్నానండి'

'ఊం—వెళ్లు నాకోర్కెలను నువ్వేం తీర్చగలవ్! పాఠాలు చక్కగా చదువుకో రంగా'

'శ్రద్ధగాచదువుతాను. యిహాతరవాతనాకు మీరే వున్నారు' అనిరంగడు వెళ్ళిపోయాడు. రంగడువచ్చి మేష్టరుగారితో మాట్లాడటం చూస్తూనేవుందికనకం. హెడ్‌మాష్టరుగారు పిలుస్తున్నారని కబురుతెస్తే వెళ్ళాడు కళాధరరావు. తానుకూడా కిటికీలుతీసి వెళ్ళిపోయింది కనకం. రంగడు కళాధరరావుకు ప్రియమైనశిష్యుడు. అతనికి ఎప్పుడైనా అలవి కానిపని చెప్పినా ఎలాగైనా తంటాలుపడి, ప్రాణంధారపోసి అయినా ఆపనిని నెరవేర్చేవాడు.

## 4

కళాధరరావూ, కనకం ఒకరిని ఒకరు చూచుకుంటూనే వున్నారు. రోజుకి ఒకసారి అయినా రంగడిని బాగా గుర్తువుంచుకుంది కనకం. కొద్దిరోజులు గడిచాయి. ఆనాడు కళాధరరావుగారు మిత్రులతో కలసి షికారుకై వెళ్లారు. పేరిగాడు యింట్లోపని అంతాచేసుకుని ఇంటిదగ్గర యేదో పనివుందనిచెప్పి వెళ్ళిపోయాడు. ఇహ ఇంట్లో కనకం ఒక్కతేవుంది. కళాధరరావుతో కలిసి మాట్లాడేది ఎట్లాగాఅనే ఆలోచన మనసులో దాగుడుమూత లాడుతోంది. కొత్తివాడు చూపుల పరిచయమేగాని యెన్నడూ నోరువిప్పి మాట్లాడి యెరగను. ఆయన హృదయం ఎట్టిదో! తొందరపడితే అల్లరిపడిపోతానేమో! ఒకకోరిక మనసులో పెట్టుకున్నప్పుడు అదినెరవేరటానికై ఒక్కొక్కప్పుడు అనేక కష్టాలు పడాలసివస్తుంది. అల్లరిపెడితే పడ్డాను వున్న ప్రాపుకాస్త వూడి పోతుంది! మనసు కోరిక నెఱవేరకవున్న ప్రాపుకూడా పోతుందేమో! రెంటికీ చెడవలసివస్తుందేమో...అనే ఆలోచనలతో కనకం బుఱ్ఱతిరిగిపో

తోంది. ఆడది, అందులోనూ, పోటీ సౌందర్యతిలక తనంతటతానువలచి వచ్చినపుడూ నిరాకరించే పురుషుడు ప్రపంచకంలో వుండడు. నీ ప్రయత్నం చక్కగా నెఱవేరుతుంది. నీకోరిక ఈడేరుతుంది. అని కనకం అంతర్వాణిని ప్రోత్సాహపరచింది. స్కూలుగంట గణగణమని వినిపించింది. తన ప్రయత్నాన్ని జోరుగా సాగించాల్సనుకుంటూ, వీధిగదిలోకివచ్చింది మామూలుగా కళాధరరావు కంటపడింది. స్కూలునుండి వెళ్తున్న రంగని చూచింది. ఏవనుకుందో ఏమిటో మనసులో, గభాలున వీధి వైపుకివచ్చింది. దారే పోతూన్న రంగని చూచింది. మనసుఆగిందికాదు అనేకసార్లు కళాధరరావు తనగదిలో కూర్చుని రంగనితో ప్రియవేటుగామాట్లాడుతూండటం చూసింది. కళాధరరావు కనకంపై కన్నేసి వుంచాడని రంగడు ఇదివరకే గ్రహించాడు. మాష్టరుగారి విరహవేదన అంతా కనిపెడుతూనే వున్నాడు. పైకిమట్టుకు పొక్కలేదు. మనసులో పెట్టుకున్నాడు. రంగడిని పిలుద్దామా, వద్దా అనుకుంటూ వీధిగుమ్మంలోనిలుచుంది కనకం. రంగడు వెళ్తున్నాడు. కనకం మనసు తహతహ పడుతోంది.

'అబ్బాయీ! ఈస్కూలు వదిలిపెట్టారాఅమ్మా' అంది రంగనివంక చూస్తూ.

'స్కూలు ఒదిలిపెట్టి అరగంటకావస్తోందండి' అన్నాడునుంచుని రంగడు.

'ఇట్లారా నాయనా!' అంది రహస్యంగా పిలుస్తున్నట్లు తాను లోపలకు వెళ్ళుతూ

'ఎందుకండీ?' అన్నాడు రంగడు వీధిగుమ్మంలో నిలుచుని.

'లోపలికిరా నాయనా ఫరవాలేదు'

'పుస్తకాలు కొనుక్కోవాల్నండి బజారుపోయి'

'తొందరపనియేదైనా వుందా ఇపుడు'

'క్లాసులో కూడా సరిగా చెప్పలేదండీమీరు'

'మతిపోయినట్లుగావుంది నాకు ఈవేళ'

'నే వెళుతున్నానండి'

'ఊఁ—వెళ్లు నాకోర్కెలను నువ్వేం తీర్చగలవ్! పాఠాలు చక్కగా చదువుకో రంగా'

'శ్రద్ధగాచదువుతాను. యిహతరవాతనాకు మీరే వున్నారు' అని రంగడు వెళ్ళిపోయాడు. రంగడువచ్చి మేష్టరుగారితో మాట్లాడటం చూస్తూనేవుందికనకం. హెడ్ మాష్టరుగారు పిలుస్తున్నారని కబురు తేస్తే వెళ్ళాడు కళాధరరావు. తానుకూడా కిటికీలుతీసి వెళ్ళిపోయింది కనకం. రంగడు కళాధరరావుకు ప్రియమైనశిష్యుడు. అతనికి ఎప్పుడైనా అలవి కానిపని చెప్పినా ఎలాగైనా తంటాలుపడి, ప్రాణంధారపోసి అయినా ఆపనిని నెరవేర్చేవాడు.

## 4

కళాధరరావూ, కనకం ఒకరిని ఒకరు చూచుకుంటూనే వున్నారు. రోజుకి ఒకసారి అయినా రంగడిని బాగా గుర్తువుంచుకుంది కనకం. కొద్దిరోజులు గడిచాయి. ఆనాడు కళాధరరావుగారు మిత్రులతోకలసి షికారుకై వెళ్లారు. పేరిగాడు యింట్లోపని అంతాచేసుకుని ఇంటిదగ్గర యేదో పనివుందనిచెప్పి వెళ్ళిపోయాడు. ఇహ ఇంట్లో కనకం ఒక్కతేవుంది. కళాధరరావుతో కలిసి మాట్లాడేది ఎట్లాగాఅనే ఆలోచన మనసులో దాగుడుమూత లాడుతోంది. క్రొత్తవాడు చూపుల పరిచయమేగాని యెన్నడూ నోరువిప్పి మాట్లాడి యెరగను. ఆయన హృదయం ఎట్టిదో! తొందరపడితే అల్లరిపడిపోతానేమో! ఒకకోరిక మనసులో పెట్టుకున్నప్పుడు అదినెరవేరటానికై ఒక్కొక్కపుడు అనేక కష్టాలు పడాలసివస్తుంది. అల్లరిపడితే పట్టాను వున్న ప్రాపుకాస్త వూడిపోతుంది! మనసు కోరిక నెరవేరకవున్న ప్రాపుకూడా పోతుందేమో! రెంటికీ చెడవలసివస్తుందేమో...అనే ఆలోచనలతో కనకం బుఱ్ఱతిరిగిపో

తోంది. ఆడది, అందులోనూ, పోటి సౌందర్యతిలక తనంతటతానువలచి వచ్చినపుడు నిరాకరించే పురుషుడు ప్రపంచకంలో వుండడు. నీ ప్రయత్నం చక్కగా నెఱవేరుంది. నీకోరిక ఈడేరుతుంది. అని కనకం అంతర్వాణిని ప్రోత్సాహపరచింది. స్కూలుగంట గణగణమని వినిపించింది. తన ప్రయత్నాన్ని జోరుగా సాగించాల్నను కుంటూ, వీధిగదిలోకివచ్చింగి మామూలుగా కళాధరరావు కంటపడింది. స్కూలునుంచి వెళుతూన్న రంగని చూచింది. ఏమనుకుందో ఏమిటో మనసులో. గభాలున వీధివై పుకివచ్చింది. దారే పోతూన్న రంగని చూచింది. మనసుఆగిందికాదు అనేకసారులు కళాధరరావు తనగదిలో కూర్చుని రంగనితో ప్రియివేటుగామాట్లాడుతూండటం చూసింది. కళాధరరావు కనకంపై కన్నేసి వుంచాడని రంగడు ఇదివరకే గ్రహించాడు. మాష్టరుగారి విరహావేదన అంతా కనిపెడుతూనే వున్నాడు. పైకిమట్టురు పొక్కలేదు. మనసులో పెట్టుకున్నాడు. రంగడిని పిలుద్దామా, వద్దా అనుకుంటూ వీధిగుమ్మం లోనిలుచుంది కనకం. రంగడు వెళుతున్నాడు. కనకం మనసు తత్తరపడుతోంది.

'అబ్బాయీ! ఈస్కూలు వదిలిపెట్టారాఅమ్మా?' అంది రంగనివంక చూస్తూ.

'స్కూలు ఒదిలిపెట్టి అరగంటకావస్తోందండీ' అన్నాడునుంచుని రంగడు.

'ఇట్లారా నాయనా!' అంది రహస్యంగా పిలుస్తున్నట్లు తాను లోపలకు వెళ్ళుతూ

'ఎందుకండీ?' అన్నాడు రంగడు వీధిగుమ్మంలో నిలుచుని.

'లోపలికిరా నాయనా ఫరవాలేదు'

'పుస్తకాలు కొనుక్కోవాల్నండి బజారుపోయి'

'తొందరపనియేదైనా వుందా ఇపుడు'

'ఏమీలేదు లెండి'

'అయితే లోపలికిరా' లోపలికివచ్చాడు రంగడు.

'అట్లాకూర్చో నాయనా!'

'.................'

'నీపేరేమిటి?'

'నా పేరు రంగనాయకులండి'

'మీ మేష్టరుగారి పేరేమిటి?'

'కళాధరరావుగారండి'

'మంచివారేనా!!

'ధర్మరాజులాంటి వారండి'

'ఏంచెపుతా రాయన స్కూలులో?'

'అన్నీ చెపుతారనుకోండి అన్నింటికంటె హిస్టరీ చాలా బాగా చెపుతారండి'

'ప్రియివేట్లుకూడా చెపుతూవుంటారా'

'ఆ...చెపుతారండీ'

'మావాళ్ళఅబ్బాయికి ప్రియివేటుచెప్పిద్దామనివుంది ఆయనచేత'

'తప్పకుండా చెప్పించండి చక్కగాచెప్పి ప్యాసుచేయిస్తారు'

'మీమేష్టరుగారికి ఏమైనాపిల్లలా'

'ఇద్దరు ఆడపిల్లలు వున్నారండి'

'మొగపిల్లలు లేరా?'

'మొన్ననే ఒక మొగపిల్లవాడుపుట్టి చనిపోయాడండి'

'అయ్యో పాపం!'

'మావాళ్ళ అబ్బాయిచదువు విషయంలో మీ మేష్టరుగారితో మాట్లాడిచేర్పించాలి—మావాళ్లు ఆభారం నామీదపెట్టారు. ఇప్పుడు

నన్ను యేంచెయ్యమంటావు? నీబుద్ధికితోచిన వుపాయం చెప్పవసిసాను కాలం అయేటట్లు'

'నన్ను మామేష్టరుగారితో మాట్లాడమంటే మీరు చెప్పిన మాటలు ఆయతోచెప్పి మీకువచ్చి చెప్పుతాను'

'మాట్లాడటం నీకు తెలియదు చిన్నతనం'

'పోనీ మీవారిచేత మాట్లాడించండి'

'మావారికి మా పుట్టింటివారి సంగతులంటే అసలుగిట్టదు'

'నీవల్లఒకపని కావాలి'

'తప్పకచేస్తాను యేమిటో చెప్పండి?'

'మరోకంటికి తెలియకూడదుసుమా'

'నాసంగతి ఇంకా మీకు తెలియదుకనుక మీరు అట్లాఅన్నారు. మాష్టరుగారివిషయంలో నేను ప్రాణం ధారపోస్తాను అనకోండి'

'నువ్వు మీమేష్టరుగారికి ప్రియశిష్యుడవని గ్రహించే నీతో చెవుతున్నాను మాటవరసకు అన్నాను. ఆమాటకి నువ్వేమీ అనుకోకు. మీ మేష్టరుగారిని మాయింటికి యెప్పుడువచ్చేటట్లు చేస్తావు'

'మీ వీలుచెప్పండిమీరు యెప్పుడు రమ్మనమని చెవుతారో చెప్పండి చెవుతాను'

'రేవు సరిగా స్కూలు ఒదిలిపెట్టగానే యీ వేళకేరమ్మనమని చెప్పు, మరిచిపోతావా?'

'మరిచిపోనండి తప్పకుండా చెవుతాను'

'రంగనాయకులూ! ఇటుచూడు. చెప్పటంకాదు. తప్పకుండాచెప్పి పంపించాలి మీ మేష్టరుగారిని మాయింటికి రేవు యీవేళకు ఆయన కోసం యెదురుచూస్తూ వుంటాను'

'నేపంపిస్తానుకాదండి' అని రంగడు వెళ్ళిపోయాడు యింటికి. రంగడు మాష్టరుగారింటికొచ్చాడు కనకంస్టోరీ అంతా చెప్పదలుచుకున్నాడు. లోపలికి చూశాడు ఒకసారి.

'అమ్మగారు పడుకున్నారండీ?'

'మంచినీళ్లు కావాల్నారంగా'

'........................'

'పడుకున్నట్లుగా వుంది. నే తెచ్చియిస్తానులే' అని మంచి నీళ్ళు తెచ్చియిచ్చాడు.

'మాష్టరుగారూ! ఈరోజు ఒకతమాషా జరిగిందండి'

'ఏమిటా తమాషా' అన్నాడు మడతమంచంమీద పడుకుని రంగడు పుస్తకాలు మూసేశాడు.

'రంగా! లాంతరుతగ్గించు తలకాయనొప్పిగావుంది గాని పిసుకుతూనువ్వుఎన్ని తమాషాలన్నా చెప్పువింటాను. అన్నాడు రంగడు మంచంమీద కూర్చుని తలకాయపిసుకుతూ జరిగింది అంతా కళ్ళకి కట్టినట్లు జ్ఞాపకానికి తెచ్చుకున్నాడు.

'నిన్నస్కూలువదిలింతర్వాత వస్తూంటే లోగనాధంగారి భార్య బయటనుంచుని నన్ను చూసిపిలిచిందండి. స్కూలువదిలిపెట్టారా అని అడిగింది, ఒదిలిపెట్టారని చెప్పేను. ఇట్లాలోపలికిరా నాయనా! నీతో ఒకమాట చెప్పాలిఅందండి'

'నిన్నా!...లోకనాధరావుగారి భార్యా పిలిచిందా! ఎందుకో వెళ్ళకపోయావ్రటరా! సన్యాసీ!'

'అంతావినండి మరియేమిటోగదా అనిలోపలికి వెళ్ళాను. నీ పేరేమిటి? మీకులమేమిటి అని యేమేమోఅడిగింది. అన్నీచెప్పాను... మాటలధోరణిలో మీ మేష్టరుగారు చదువు బాగాచెపుతారా? అని అడిగింది. మిమ్మల్నిగురించి'

'నువ్వు యేమని చెప్పావు?'

'చాలాబాగా చెబుతారు అనిచెప్పాను'

'మనకేమన్నా ప్రైయివేటు గిరాకీలగులుతుందా ఏమిటి?

'వినండి చెపుతాను. తొందరపడకళారేం అంత! అంతటితో మీపేరూ అది అడిగింది. కళాధరరావుగారని చెప్పాను మావాళ్ళ అబ్బాయికి ప్రియివేటు చెప్పించాలనివుంది మీమేష్టరుగారిదగ్గర ఒక్క-సారి వారితో మాట్లాడాలి ఎట్లాగని అడిగింది.'

'మాట్లాడవచ్చునని చెప్పకపోయావుటోయ్'

'అట్లాగే చెప్పాను. నీవు మీమేష్టరుగారికి చాలా ప్రియమైన శిష్యుడులా గున్నావే అంది. రేపు ఈవేళకు స్కూలు వదిలిపెట్టిం తర్వాత ఒక్క-సారి మీమేష్టరుగార్ని మాయింటికి రమ్మనమనిచెప్పు, చెప్పటమే కాదు తప్పకవచ్చేటట్లు చెయ్యాలి అని ఎంతోగట్టిగా చెప్పింది. ఆమెస్వయంగా మాట్లాడాలట మీతో'

'నువ్వ్ ఏం చెప్పివచ్చావు'

'చెపుతాలెండి అనిచెప్పి వచ్చాను. మీకోసంరేపు వేచియుంటానని చెప్పమన్నది.'

'చెపుతాలెండి అని చెప్పివచ్చాను'

'సరేలే రేపువెళ్ళిమాట్లాడదాం'

'నేను యింటికిపోతానండి యిదీసంగతి'

'ఫో పాపం ప్రొద్దుపోయింది' రంగడువెళ్లిపోయాడు.

---

# 5

లోకనాధంగారు గదిలో పందిరి మంచంమీద పడుకుని నిద్రపోతున్నారు మయుమరచి అప్పటికి సాయంత్రం నాలుగు గంటలు దాటింది. యీాయన యెప్పుడు లేచి వెళ్ళిపోతాడా షికారుకి అనివుంది. కనకానికి భర్త యేవేళకూ లేచేటట్లుగా కనుపించలేదు. లేపితేగాని లేవడనుకుంది. భర్తబైటకి వెళ్ళకపోయినట్లయితే తాను మనసులో పెట్టు

కన్న ప్రయత్నమంతా వృథా అయిపోతోంది. స్కూలు ఒదిలిపెట్టగానే ఆయనతప్పక వచ్చేస్తారు అనుకుంది. పందిరిమంచం దగ్గరకువెళ్ళి,

'యేమండోయ్!...మిమ్మల్నే...' అంటూ వీపుమీద చెయ్యి వేసి లేపటం మొదలుపెట్టింది.

'అబ్బ!...యేమిటి...యెందుకూ?' అన్నారు బద్ధకంగా.

'యెందుకేమిటి? అయిదుగంటలయితే యింకా నిద్రయేమిటి లెండి...ఒకటే నిద్రా?'

'అయిదుఅయిందా యిప్పుడు?'

'అవస్తోంది లెండి...'

'అబ్బ! మంచినిద్ర చెడగొట్టావే!'

'యెప్పుడో ఒంటిగంటకి పడుకున్నారు. ఇంకా నిద్రతీరలేదుటండీ! పగలు అంతచేటూ పడుకోకూడదు.' లోకనాథంగారు మంచం దిగి వెళ్ళి నిద్రమత్తు తీరేటట్లుగా ముఖం కడుక్కుని వచ్చారు.

'కనకం! బుట్టలో బత్తాయికాయలు వున్నాయా?'

'చూస్తాను వుండండి.' అని లోపలికి వెళ్ళింది.

'యేం లేవా?...'

'రెండు వున్నాయి'

'ఒకకాయ ఒలు' గబ గబా కాయ ఒలిచి తొనలు లోకనాథంగారిచేతులో పొయ్యిపోయింది.

'నువ్వుకొన్ని తీసుకో కనకం!' అన్నారు ప్రేమతో.

'నాకువద్దు మీరు తీసుకోండి' బత్తాయి తొనలుతింటూ.

'కనకం! ఆ బట్టలు యిలాతెచ్చియియ్యి' అన్నారు లోకనాథంగారు. భర్త నోటివెంట ఆమాట యెప్పుడు వస్తుందాఅని చూస్తోంది కనకం వెంటనే శ్రద్ధగా బట్టలుతెచ్చి అందిచ్చింది. బట్టలు కట్టుకునివెళ్ళిపోయారు లోకనాథంగారు! వీధితలుపు గడియవేసుకుని లోపలికి వెళ్ళి

పోయింది కనకం. స్నానం చేసింది. వాలుజెడ అల్లుకుంది ముఖానికి స్నో రాచుకుంది. లేతగులాబీరంగుచీర కట్టుకుంది. మల్లెపూలచెండు వాలుజెడలో జారనిడిచింది ముచ్చటగా అందంగా తయారయింది కాఫీ కాచి ప్లాస్కులో పోసింది. యింకేవో ఫలహారాలూ అనిసిద్ధంజేసింది. కళాధరరావు స్కూలు వదిలిపెట్టగానే వస్తాడుకదా! ఆయనతో యేమని మాట్లాడను. ఆయనను యేమని పలకరించను. మొదటగా అని యేమేమిటో ఆలోచించుకుంటో తనలోతాను మురిసిపోతోంది. స్కూలు వదిలిపెట్టారు. పిల్లలు గంతులువేస్తూ పరుగులెత్తుతున్నారు. కనకం యిహామేష్టరుగారు వస్తారు. అని అద్దంలో తన అందాన్ని తాను చూసుకుంటోంది. పలుమారు స్కూలు వదిలిపెట్టగానే పదినిమిషాలు ప్రియిమేటురూమ్‌లో కూర్చుని కనకం యింటికి బయల్దేరాడు కళాధరరావు. కళాధరరావు రావటం చూసింది. కనకం వీధితలుపులుతీసి లోపలగా వెళ్ళింది. కనకంతో మాట్లాడాలికదా యివాళఅని కళాధరరావు జరీకొలుకుల వుత్తరీయం వేసుకుని ఖరీదుగలకోటు తొడుక్కుని ముస్తాబై వచ్చాడు ఆనాడు స్కూలికి కోటుసర్దుకుంటూ లోకనాథంగారి గుమ్మంమెట్లు యెక్కాడు. లోపలనుంచి కనకం కంటపడింది. చిఱునవ్వుతో కనకంవంక చూశాడు.

'లోకనాథంగారూ!' అని పిలిచాడు బైటనిలుచుని.

'లోపలికిరండి ఫరవాలేదు' అంది లోపలినుంచి కనకం సున్నితంగా—

ఆమాటను ఆధారంచేసుకుని లోపలకు వెళ్ళాడు కళాధరరావు కుర్చీ చూపిస్తూ ఆహ్వానించింది కనకం. ఆ కుర్చీలో కూర్చున్నాడు కళాధరరావు తలుపు దగ్గరగావేసి వస్తానని వెళ్ళి గడియవేసి వచ్చింది.

'రంగనిచేత యెందుకు కబురు పంపేరు రమ్మని?'

'యెందుకో ఆ అబ్బాయి చెప్పలేదా మీకు?' అంది చిఱునవ్వుతో ముఖంలోకచూస్తూ.

'ప్రయివేటు చెప్పిస్తారట యెవరికో ఆ విషయమై మీతో మాట్లాడాలట ఒకసారి వచ్చి కలుసుకోమన్నారండీ అని చెప్పాడు!'

'చెపుతారా మీరు?'

'యెవరికో చెప్పండి?'

'నాకే చెప్పాలి! అంది లేతనవ్వుతో?

'... ... ... ...'

'మాట్లాడరేం?'

'చెప్పించుకుంటే చెపుతాను'

'యేం పుచ్చుకుంటారో యేమిటో ఆలోచించండి వస్తున్నాను' అని తొందర తొందరగా లోపలకు వెళ్ళింది. లోపలినుంచి కప్పులతో కాఫీ తీసుకువచ్చింది, టేబుల్ మీద పెట్టింది. యింకేవేవో ఫలహారాలు ప్లేట్లతో తెచ్చింది. కళాధరరావు ముందు పెట్టింది. ఆశ్చర్యపోతున్నాడు. కనకానికి తనయందు వున్న ప్రేమకి! కనకాన్ని చూస్తున్నకొలదీ అంతు లేని సంతోషం కలుగుతోంది!

'యేమిటి యిదంతా చాలా హడావిడిచేశారేమిటి!'

'ఆవిఫలహారంచేసి, కాఫీ తాగండి'

'అమ్మో! యివన్నీ నేను తినగలనా?'

'అహా...ఆ మాత్రానికే!'

'యెందుకు మీరునన్ను యింతయిదిగా గౌరవిస్తున్నారో నాకు అర్థం కాకుండావుంది!'

'తరువాత చెపుతాను ముందు ఫలహారం చెయ్యండి'

'నేను ఒక్కడినీ తినలేను యివి!'

'తినకలిగినంత తినండి'

'మరి మీరో?'

'నేను తరువాత తింటానులెండి'

'అబ్బే! అలా కాదు నా చేత తినిపించాలి అంటే మీరు నాతో పాటుగా తినాలి.

అయితే మీకంత ప్రేమేవుంటే నామీద అలా చెయ్యటానికి అభ్యంతరంయేమిటి' అంది ప్రసన్నమైన ముఖంతో.

'ఊం నువ్వుకూడా తినుమరి?'

'యిక్కడకాదు అలా గదిలోకిరండి' అని గదిలోకితీసుకు వెళ్ళింది. కళాధరరావు కనకం వెనకవచ్చాను.

'కనకం! నువ్వు నన్ను యింతగా ప్రేమించటానికి కారణం యేమిటో వినాలనివుంది చెప్పవూ?'

'మా తల్లితండ్రులు ధనానికి ఆశించి యీ ముసలాయనకుయిచ్చి అంటుకట్టారు. పెళ్ళి చూస్తున్న పెద్దలంతా ఆశ్చర్యపోయారు. నన్ను చూసి నా స్నేహితులంతా కూడా యెంతో జాలిపడ్డారు. యెంతజాలిపడి మట్టుకువాళ్ళు యేం చెయ్యగలరు. స్నేహితురాలిజీవితం యిలా అన్యాయం గతి అయి పోతోంది గదా! అని కళ్ళనీళ్ళు విడిచారు.'

'అంతకంటె వాళ్ళుమాత్రం యేంచెయ్యగలరు పాపం'

'కన్నతల్లితండ్రులే తడిగుడ్డకట్టి కన్నకూతురు కంఠం కోస్తోంటే అడ్డుపడేవారు యెవరా?'

'అవును కనకం. నీ తల్లిదండ్రులు నీ జీవితాన్ని కష్టాలుపాలు చేశారండి. అనుకూలమైన దాంపత్యంవుండి సంసారం చక్కగాసాగుతూ వుంటే సిరిసంపదలు లేకపోయినా కొంగూ, కొంగూ ముడివేసుకుని మూడుపూట్లు ముష్టియెత్తుకుతిన్నా మనసుకి సంతోషంగా వుంటుంది.

'యేమిటో అనుమానిస్తున్నారు?'

'అనుమానంకాదు కనకం! నూర్కలు దగ్గరయిల్లు అని ఆలోచిస్తున్నాను గాని మరేంలేదు.'

'యేమైనాసరే మీరు నా ప్రేమను నిరాకరించవద్దు'

'కనకం! నీ ప్రేమను నేను మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను. మన ప్రేమకు ఆటంకాలు యేమీ జరగకుండా మట్టుకు ఆలోచించు'

'ఆ భారమంతా నామీద పెట్టండి. మీ కెందుకు.'

'నీకు యెప్పుడు వీలైతే అప్పుడు రంగడిచేత నీకు తోచినట్లుగా కబురంపు వెంటనే వస్తాను'

'నన్ను మరిచిపోకండి' నువ్వు మరిచిపొమ్మంటే మట్టుకు మరిచిపో గలనా అంటూ వెళ్ళిపోయాను.

---

# 6

కళాధరరావు, కనకం అప్పుడప్పుడు వీలైనసమయాల్లో కలుసు కుంటూనే వున్నారు. కోర్కెలు ఫలించేరోజువస్తే కాలంకూడా అట్లాగే కలిసివస్తుంది. ఆనాడు లోకనాథంగారు యెక్కడికో వెళ్ళి పోయారు. స్కూలువిడిచి పెట్టేవేళ అవస్తోంది. విశ్రాంతిసమయం అవటంచేత ప్రయివేటురూమ్‌లోకివెళ్ళి కూర్చున్నాడు కళాధరరావు. కనకం వీధిగది లోకివచ్చి యివాళ స్కూలు ఒదిలిపెట్టగానే రమ్మని సౌజ్ఞ చేసింది. జడ అల్లుకుంటూ, కనకంసౌజ్ఞను గ్రహించాడు కళాధరరావు కనకం తన ముస్తాబు, ముచ్చటలోవుంది, స్కూలు ఒదిలిపెట్టారు. వెంటనే కనకం యింటికివచ్చాడు కళాధరరావు.

'మీరు నేచేసిన సౌజ్ఞ గ్రహించారా?'

'ఆమాత్రం గ్రహించలేనా కనకం!'

'యిదుగో కాఫీ త్రాగండి'

'వచ్చినప్పుడల్లా యిదో క గౌరవమూ యేమిటి నాకు?'

'మరేం ఫరవాలేదు పుచ్చుకోండి'

'యిహానుంచి యెప్పుడూ నాకోసం శ్రమపడబోకు కనకం'

'శ్రమయేముంది దీల్లో?'

'నీకు తాగేఅలవాటులేదాయె. ప్రత్యేకం నాకోసమైకాయాలి అది శ్రమకాదూ?'

'యింతమాత్రానికే'

'నాకోసమైనిన్ను శ్రమపెట్టటం నాకు యిష్టంలేదు.'

'త్వరగా తాగండి చల్లారిపోతుంది.'

'నేను మొదటనే ఒకమాట చెప్పాను నువ్వు అప్పుడే మరిచి పోయివుంటావు...'

'యేమిటో నాకు జ్ఞాపకంలేదు'

'నాచేత యేదైనా తినిపించాలీ అంటే ముందుగానువ్వు కొంత పుచ్చుకోవాలని చెప్పలేదూ?'

'ఓహో...అదా!'

'ఊఁ...కానీ—'

'సరే అలాగే పుచ్చుకుంటాలెండి. మీరు త్రాగండి'

'అదికుదరదు ముందుభాగం నీదే'

'ఊఁ నేను తాగుతున్నా త్రాగండి! అంటూ కాఫీతోవున్న కప్పుతీసుకుంది. యిద్దరూ కాఫీ త్రాగారు.

'యెలా తెలుస్తాయి?' కనకం మనసంగతులు నీ భర్తకు తెలుస్తేనో?

'ఒకవేళ తెలిస్తే మాట'

'యెందుకు తెలుస్తాయి, యెవరుచెపుతారు. యెప్పటికీ తెలియవు!

'మీకూ నాకూ భగవంతుడికీ తెలియాలసిందే. ఒకవేళ తెలిస్తే రంగడికీ తెలియవచ్చును.

'రంగడికి తెలుసును.'

'రంగడు మీప్రియశిష్యుడేగా!'

'లోకనాథంగారు యెక్కడికి వెళ్ళారు?'

'యెక్కడికో వెళ్ళారు షికారుగా'

'ఆయన్ని చూస్తే నాకు భయంగా వుంటుంది.'

'మీ కెందుకు అంతభయం?'

'మనిషి చాలా ముక్కోపిలాగ కనిపిస్తాడేం?'

'కనిపించేదేమిటి ముక్కోపే!'

'యిటువంటిముక్కోపితో యెలాసంసారంచేస్తున్నావు కనకం?

'నాతో కాపరంచేసేవారు ముక్కోపికారు తెలిసిందా యిప్పుడైనా......?'

'యెవరు నీతో కాపరంచేసేది?'

'అబ్బ! యెంత తెలియనట్లుగా మాట్లాడుతున్నారండీ! యేం తెలియదుపాపం మీకు అవునా?'

'తెలియకనేగా నిన్ను అడగటం!'

'యెవరు అన్నవారే'

'అంటే నాకు తెలియటంలేదు.'

'నాతో యిప్పుడు మాట్లాడుతోంది యెవరూ?'

'నేనూ......'

'మీరే...సరేనా తెలిసిందా?'

'నా సంగతియేనా నువ్వు చెప్పింది!'

'... ... ... ...'

'లోకనాథంగారివల్ల నీకు ఏ మాత్రమైనా సౌఖ్యంవుందా లేదా!'

'యీ సందేహం యిప్పుడెందుకు కలిగింది మీకు?'

'వున్నది వున్నట్లుగా నిజంగా చెప్పాలి'

'యెప్పుడైనా మీదగ్గర అబద్ధం ఆడానానేను?'

'లేదనుకో చెపుతున్నాను'

'... ... ... ...

'డబ్బై యేళ్ళవారు ఆయనా! పాతికేయేళ్ళదాన్ని నేను ఆయనతో నాకు యేంసౌఖ్యంవుంటుంది! ఆయనమీద నా కేంఆశవుంటుంది'

'ఆయన నన్ను యేంసుఖపెట్టగలరుఅంటారు అంతేనా!'

'లోకనాథంగారు వచ్చేవేళఅయిందేమో'

'ఆయన యిప్పుడప్పుడే రారులెండి'

'మీగుమ్మం యెక్కి వస్తానా లోపలికివచ్చేటప్పుడు యేమూల నుంచి యెవరుచూస్తారో అని నాకు భయంగానేవుంటుంది సుమా...'

'మాచినామటుకేం ఆయింట్లో యెవరికో ప్రైవేటు చెప్పటానికై వెళుతున్నారు అనుకుంటారు. గుమ్మడికాయలదొంగ యెవరూ అంటే బుజాలుతడుముకున్నట్లుగా మీఅంతట మీరే జడుస్తారేం!'

'నీతో అంటున్నాను కనకం'

'వచ్చేటప్పుడూ నిర్భయంగా వచ్చేసెయ్యండి. అంతగా కొంప మీద యేదైనావస్తే ఆలోచిద్దాము. మీరలాగనక జడుస్తూ, జడుస్తూ వచ్చారంటే యెవరైనాచూస్తే తప్పక అనుమానపడతారు...చేతులారా ముప్పుతెచ్చుకున్నట్లు అవుతుంది'

'చెప్పావుగా యికనుంచి అంతేచేస్తానులే'

లోకనాథంగారి రెండోసమ్మంధంకొడుకు ఆనంద్. సవితితల్లి సరిగా చూడదని ఆనంద్ని ఆవూరిలోనే వేరేబంధువుల యింట్లోవుంచి పోషణజరుపుతున్నారు. ఆనంద్ వయసున చిన్నవాడైనా బుద్ధితెలిసిన వాడే! ఫోర్తుఫారం చదువుతున్నాడు. తండ్రిదగ్గరకు తరుచుగావస్తూ పోతూవుంటాడు. ఆనాడు తండ్రికోసమై వచ్చాడు. ముందుగేటు దాటి గుమ్మంయెక్కగానే గుసగుసలు వినిపించాయి అతనికి. సవితితల్లి మాట గుర్తుపట్టాడు. మరోకంఠనాదం తండ్రిదికాదని తెలుసుకున్నాడు. తలుపుకొట్టకుండా ప్రక్కగానిలుచున్నాడు పకపకలూ, గుసగుసలూ ఆలకిస్తూ, ఆతొందరలో కనకం వీధిగది కిటికీరెక్కలు గడియవేయటం

మరిచిపోయినది. గాలికి కిటికీరెక్కలు తెరుచుకున్నాయి. మెల్లిగా కిటికీ లోనుంచి చూశాడు ఆనంద్. కళాధరరావు గోడను ఆనుకున్న కనకం రెండుబుజాలపైనా రెండుచేతులుమోపి ముఖంలో ముఖంపెట్టి కులాసాగా సరసాలాడటం అతనికంట పడింది. చప్పున పక్కకు తప్పుకుని వెళ్ళిపోయాడు ఆనంద్. కిటికీరెక్కలు గడియవేసింది కనకం.

---

## 7

ఆనంద్‌కి సవితితల్లిప్రవర్తన మహాకోపంగావుంది. యిటువంటిది వుండటంచేత తనతండ్రికూడా తల్లిచెడ్డప్రవర్తనవల్ల అప్రతిష్టపాలవుతాడనుకున్నాడు. తనతండ్రికి చెడ్డబుద్ధిగల భార్యాదొరికినందులకు తండ్రి గౌరవముకూడా పోతుందే! అని విచారిస్తున్నాడు తనలోతాను మరునాడు తండ్రికై వచ్చాడు.

'అమ్మా! నాన్న యేడి?'

'గదిలో వున్నారు'

'పడుకున్నాడా?'

'లేదు మెళుకువగానేవున్నారు'

యీమాటలు విన్నాడు లోకనాథంగారు.

'యెవరే వచ్చింది?'

'మీఅబ్బాయండి'

'ఆనందా?'

'అవును'

'యిట్లారమ్మను'

'........................'

తండ్రిమాటవిని గదిలోవున్న తండ్రిదగ్గరకు వెళ్ళాడు ఆనందు. ఆనందు అంటే కనకానికి పడను.

తండ్రిపలకరిస్తూ తండ్రితో యేమీ మాట్లాడలేకపోయాడు. తానుచూచినదృశ్యమే కళ్ళకు కట్టినట్లుగావుంది. సవితితల్లిపైన పట్టరాని కోపము వస్తోంది అల్లర్పాలయిపోయేరోజులు వచ్చాయే అన్న విచారం కలుగుతుంది, యిదంతా తండ్రిచేతులారాచేసుకున్న అపకారము! వృద్ధాప్యంలో నాలుగోపెళ్ళిచేసుకుని తనంతటతానే తెచ్చిపెట్టుకున్నాడు.

'ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నావూ?'

'అబ్బే! యేమీలేదు నాన్నా'

'యేమిటో ఆలోచిస్తూన్నావు పైకిచెప్పవుగాని—'

'నామనసులోవున్న మాటని నిమ్మదిగా చెపుతాను. నన్ను తొందరచెయ్యకు నాన్నా' —

'ఆలోచించి చెప్పాలా?'

'ఆలోచించవలసింది యేమీలేదు కాని నేను నీతో ఒకసంగతిని గురించి చెప్పటానికై వచ్చాను కాని...'

'యేమిటి సందేహిస్తున్నావు?'

'ఇక్కడ చెప్పతగిందికాదు'

'రహస్యమైనసంగతియా?'

'అవును. నీతో రహస్యంగా చెప్పాలి'

'మీరు యింట్లోవుంటారుకదూ?' అంది కనకం.

'యెందుకూ? పనివుండి పోదాంఅనుకుంటున్నామే'

'సుభద్రమ్మగారి యింటికి పేరంటానికై వెళ్ళి వస్తాను వుండండి. నేనురాగానే మీరు వెళుదురుగాని'

'ఊఁ......వెళ్ళి రా వుంటాంలే'

'మరీ, మరీపిలిచి వెళ్ళింది పాపం'

'యేం వాళ్ళఇంట్లో?'

'వాళ్ళ పెద్దఅమ్మాయికి పిల్లాడుపుట్టాడు కాదూ—ఆపిల్లవాడిని ఊయ్యాలలో వేస్తారట'

'పిలిచినప్పుడు వెళ్ళకపోతే బాగుండదు'

'వెళుతున్నాను' అని జేబురుమాలు ఒకటితీసుకుని వెళ్ళిపోయింది కనకం——'

'ఆనందూ! నువ్వు చెప్పదలుచుకున్నదేమిటో దాచకుండా చెప్పేసెయ్యి. నాదగ్గిర యేమీదాయకు'

'మనం అల్లరిపడిపోయేరోజులు వచ్చాయి......'

'ఎందువల్ల?'

'నువ్వు యీపెళ్ళి చేసుకోవటంవల్ల'

'సరిగా చెప్పు ఆనందూ'

'అవును నాన్నా! ఆమనిషి మంచిదికాకపోయినప్పుడు సంసారం అల్లరిపడక యేమవుతుంది'

'యెవరు మంచివారుకారంటావు'

'కనకంఅమ్మ బుద్ధిమంచిదికాదు నాన్నా'

'కనకం మంచిదికాదూ......'

'ముమ్మాటికీ మంచిదికాదు'

'యెందువలన?'

'నాకు చెప్పటానికికూడా సిగ్గుగావుంది నాన్నా'

'చెప్పు ఆనంద్'

'నువ్వు నమ్మవేమో?'

'నీమాటలను తప్పక నమ్ముతాను'

'నిన్న నేను నీకోసమె యింటికివచ్చాను'

'ఎన్నిగంటలకి?'

'సాయంత్రము స్కూలు ఒదిలిసతర్వాత. అయిదు అవుతుంది. నేను ఒచ్చేటప్పటికి వీధితలుపు వేసివుంది. గేటులోనుంచి వచ్చి మెట్లు యెక్కి అరుగుమీదకి వస్తినిగదా! వీధిగదిలోనుంచి గుసగుసలూ, వక

పకలూ, వెకివెకలూ వినిపించాయి. నవ్వూ, అమ్మేమో అనుకున్నాను మొదట. తరువాత నవ్వుకాదని నాకు అనుమానంకలిగింది. తలుపు కొట్టకుండా పక్కగానుంచుని ఆమాటలు కొంతసేపు ఆలకించాను—ఆడకంఠం అమ్మది. మొగకంఠం నీదికాదు......'

'ఎవరై వుంటారని వూహించావు?'

'అంతానీను వూహించటందేమిటి కళ్ళారా చూశాను—నాకళ్ళను నేనే నమ్మలేకపోయాను'

'ఎవరిని చూశావు?'

'మొదటనుంచీ చెప్పనీ'

'ఊం......చెప్పు......చెప్పు'

'నిమ్మదిగా కిటికీరెక్కలసందునుంచి చూదాంగదా అని కిటికీ దగ్గరకి వెళ్ళాను—కిటికీరెక్కలు గడియవేయటం మరిచిపోయారుకాబోలు గాలికి రెక్కలు తెరుచుకున్నాయి'

'..................'

'అంతటితో మెల్లగా పక్కనుంచి చూశాను'

'ఎవ రెవరు వున్నారు గదిలో?'

'అమ్మయేమో అటుపక్కగా గోడను ఆనుకుని నిలుచుంది. ఒకాయన రెండుచేతులూ అమ్మ రెండుభుజాలుమీందా వేసి యెదురుగా నిలుచున్నాడు......'

'ఆమగమనిషి యెవరో కనిపెట్టవా నీవు?'

'మొదట ముఖం సరిగాకనపడలేదు నాకు. పరీక్షనిపెట్టి చూస్తిని గదా......'

'యెవరూ?......'

'స్కూలుమేష్టరుగారే......'

'యేస్కూలు మేష్టరుగారూ?'

'శశాధరరావుగారు...'

'ఆయనా! ఎఱ్ఱగావుంటాడు! పొట్టిమీసాలు'

'ఆ...ఆయనే...'

'యిటువంటివాడు అనుకోలేదే'

'మీదచేతులువేసి యెదురుగానిలుచుని ముఖంలో ముఖంపెట్టి అమ్మతో సరసాలాడుతున్నాడు...'

'మర్యాదాకలమనిషి అనుకున్నా! ఆమాటలధోరణిచూచి ఇంత బుద్ధితక్కువవాడు అనుకోలేదు'

'మనవాళ్ళు మంచివాళ్ళయితే యితరుల్ని అనవలసిన పనియేమి వుంది. అమ్మ మంచిదయితే ఆయన మనయింట్లో కాలుపెట్టగలడా? అమ్మబుద్ధి మంచిదికాదు కనకనే ఆయన అంతచొరవచెయ్యగలిగాడు! అదుగో అమ్మవస్తోంది యిహ ఆసంగతి యెత్తకు. యిది చెబుదామనే వచ్చాను......'

'యెటువంటిఖర్మంవచ్చింది చివరికి నాకు. యెంతబుద్ధితక్కువపని చేశాను! పెళ్ళిచేసుకోకుండావుంటేనే ప్రాణం హాయిగావుండేది'

'యిహ వూరుకోనాన్నా అమ్మ వచ్చింది'

---

## 8

ఆనందు చెప్పినమాటలు మరిచిపోదామనుకున్నా మరవలేక పోతున్నాడు లోకనాధంగారు! కనకంమీద యిదివరకు యెంతో ప్రేమగా వుంటూవుండేవాడు! అంతకంతకి ఇప్పుడు భార్యఅంటే పరమశత్రువుగా తలుస్తున్నాడు! ఆయనమనసు పట్టరానంత క్షోభపడుతోంది. నేను పెండ్లిచేసుకోవటమేమిటి! ఆబుద్ధిహీనుడు నాయింట్లో చేరి నాభార్యతో కలిసి సరసాలు ఆడటమేమిటి! మొదటనుంచి పెద్దయి యింట్లో కాలు

పెట్టినప్పటినుంచి దీనివైఖరిచూస్తే నాకు అనుమానంగానే వుండేది! ఛా...ఛా...అటువంటిదికాదు అని నామనసుకి నేనే సమాధానంచెప్పుకుంటూవుండేవాడిని! వాలుజెడవేసుకుని చక్కగా పువ్వులూ అవి పెట్టుకుని సింగారించుకుని ప్రియునికోరకై యెదురుచూస్తూన్న ప్రియురాలిలాగా యెప్పుడూ వీధిగుమ్మంలో నిలుచుంటుంది. చివరికి ఈవృద్ధాప్యంలో నాకు యీఆనిలటిని సమకూర్చి నాసంసారాన్ని, నాజీవితాన్ని అల్లరిపాలుచెయ్యదలుచుకున్నాడు భగవంతుడు! దానికి యెలా బుద్ధి చెప్పను! చెడుఅలవాట్లకు అలవడింది చెపితేమాటుకు విని మంచిమార్గానికి వస్తుందనియెల్లా? పుట్టినబుద్ధి పుడకలతోగాని పోదుకదా! యిక్కడనుంచి పోయి అది యేంచేస్తే నాకెందుకు ఆముగ్గురుతోపాటే యిదికూడా చచ్చిపోయింది అనుకుంటాను.

మామూలుగా యేబాకీనిగురించో, బాకీదారుణ్ని గురించో, గృహవిషయాల్ని గురించో ఆలోచిస్తున్నారనుకుంది. భర్తదగ్గరకువచ్చింది.

'యేమిటి ఆలోచిస్తున్నారు?'

'యేంలేదు...' అన్నాడు కోపంగా.

'చాలాసేపటినుంచి ఆలోచిస్తూ యేమీలేదు అంటారేం! నాతో చెప్పకూడదా?'

'.....................'

'చెప్పకూడనిది కాబోలు! అయితే నేను అడగనులెండి'

'నీతో చెప్పకూడనిది యేముంటుంది. నువ్వు మావంశాన్ని నిలబెట్టటానికై వచ్చిన ముద్దులభార్యవే' అన్నాడు కళ్ళెర్రజేసి మనసులో వున్న కోపాన్ని పట్టలేక.

'యేం యివాళ అంతకోపంగావున్నారు?'

'ఎవరిమీద కోపంచేస్తే ఎవరువూరుకుంటారు'

'యేమిటోగాని ఇవాళ నాకంటికి తమాషాగావున్నారు'

'......................'

'నామీదే యేదో కోపం కలిగినట్లుగా వుంది మీకు...'

'రోజులు మంచివి కానప్పుడు వినాశకాలే విపరీతబుద్ధి అన్నట్లు బుద్ధిమంతులయినా చెడుమార్గాన పడుతూవుంటారు. మనసులు అలా మారిపోతూవుంటాయి'

'ఇప్పుడు యేం జరిగింది?'

'యేం జరిగితే యేం చెపుతున్నాను'

'......................'

'యెంత మంచిబుద్ధికలవారినయినా నమ్మటానికి వీలులేదు కనకం! పైకి మాట్లాడే మాటలు మటుకు తేనెతేటలులాగా వుంటాయి. మనసులలో కోర్కెలు మటుకు మాటుమణిగివుంటాయి—' అన్నాడు గూఢంగా మాట్లాడుతూ లోకనాధంగారు—భర్తకి నావిషయంలో యేదో అనుమానం కలిగికదే అనుకుంది కనకం. భర్తమనసులో మాటను పూర్తిగా తెలుసుకోదలుచుకుంది.

'కాలం ఎన్ని మార్పుల్ని అయినా కలగజేస్తుంది? బుద్ధిహీనులను బుద్ధికలవారినిగా చేస్తుందా? బుద్ధికలవారిని బుద్ధిహీనులను జేస్తుందా? కాలం యెన్ని మార్పులు చెందినా మనుష్యుల నిజస్వభావాలు మటుకు మారవు. ఒకవేళ బుద్ధిమంతులను చూచినప్పుడు బుద్ధిహీనులకు తాత్కాలికవైరాగ్యం కలిగినా అది మరుక్షణంలోనే మాయమయిపోతుంది. చెప్పుతినెడు కుక్క చెఱకుతీపెరుగునా అన్నట్లుగా చెడ్డవారికి మంచిగుణాలు ఎలా అలవడుతాయి కనకం?'

'ఇవాళ మీరు యీగొడవలో పడ్డారు యేంచేత?'

'నిన్న నువ్వు పేరంటానికై వెళ్ళినప్పుడు అచ్యుతరామయ్యగారు కబురుచేశాడు యెందుకో ఒకసారివచ్చి మాట్లాడివెళ్ళమని'

'అచ్యుతరామయ్యగారెవరండీ?'

'నువ్వు యెరగవులే ఆయన నాబాల్యస్నేహితుడు. మొదట్లో గదా అని వెళ్ళాను కూర్చోపెట్టి ఆయన గొడవంతా చెప్పుకొచ్చాడు ఆశ్చర్యపోయాను నేను—'

'యేమని చెప్పారేమిటి?'

'ఆయనా నాయీడువాడే! ఆయన రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నాడు యిద్దరుభార్యాలూ పోయారు'

'ఎవరన్నా పిల్లలువున్నారా?'

'పిల్లలుకలగలేదు వాళ్ళు నాతోపాటుగానే మూడవపెళ్ళిచేసుకున్నాడు. పెళ్ళినాటికి ఆయనకు అరవై అయిదు యేళ్ళు వున్నాయి. ఆవిడకు ఇరవై అయిదు యేళ్ళు వుంటాయి—'

'ఆయన భార్యాపేరేమిటి?'

'పేరు యేదోవుండాలి జ్ఞాపకంలేదు నాకు. పేరేదయితే మన కెందుకులే అసలుసంగతి విను. పైకిమటుకు చక్కగా భర్తతో మహా పతివ్రతలాగా భర్త కష్టసుఖాలలో తానూ భాగం పంచుకుంటున్నట్లుగా మాట్లాడుతుందిట—లోలోపల గోతులుతీస్తూవుంటుందట'

'యేంచేస్తూ వుండేదేమిటి?'

'సాయంత్రంఅవగానే వేశ్యలకంటె యెక్కువగా శృంగారించుకుని వీధిగుమ్మంలో నిలుచునేదట—భర్త మాటలు వింటూన్న కనకం, భర్తచెప్పేదంతా తననుగురించే యెవరిమీదనో పెట్టి చెప్తున్నాడనుకుంది. యెలాగో తనరహస్యప్రవర్తన భర్తకి తెలిసింది. నాసంగతిని గురించే యిందాకటినుంచి ఆలోచిస్తున్నాడని గ్రహించింది. తనప్రవర్తనసే ఒకరిమీద పెట్టి చెపుతున్నాడని తలంచింది.

'మంచిబట్టలు కట్టుకుని శుభ్రంగావుండటానికి తప్పేమిటి?'

'సంసారపక్షంలో శుభ్రతగావుండటం నేర్చుకోవాలిగాని, సానుల లాగ మితిమించిన అలంకారాలుచేసుకుని వీధిగుమ్మంవదలకుండా నులు

చుని దారేపోయే యవ్వనవంతులవంక వాల్చూపులు చూడటం అది సంసారికి లాయికీఅయినవనేనా కనకం?'

'వీధిగుమ్మంవంక చూడకుండా వీధిముఖం చూడకుండా, యెప్పుడూ యేఆడదిమటుకు యింట్లోపడి చావకలదు! అంతమాత్రంలో బుద్ధి మంచిదికాదంటేయెలా?'

'నేనూ అలాగేఅనుకున్నా—ఆయన చెపుతూంటే ఆప్రశ్న నేనూ అడిగాను అంతావిను—భార్యావైఖరిచూస్తూ యీపద్ధతి మనకు తగదు అని అప్పుడప్పుడు కేకలువేస్తూవుండేవాడట! వినేదికాదటా; మామూలు పరికారమేనడుస్తూ వుండేదట. ఒకరోజున బజారునుంచి వచ్చేటప్పటికి వీధితలుపులువేసివున్నాయట'

'లోపల యేదైనా పనిచేసుకుంటుందేమో?'

'పని దానిపిండం! అపరిత్రిష్టముండ! గుమ్మంయెక్కేటప్పటికి ఆయనకి లోపలనుంచి గుసగుసలు వినిపించాయట! యెవరాలోపల! అని ఆయనకు అనుమానంకలిగి తలుపుకొట్టకుండా చాటుననుంచుని వినటం మొదలుపెట్టాడట. సరసపల్లాపాలు వినిపించాయట! ఆశ్చర్యపోయి కిటికీరెక్కలసందునుంచి చూశాడట మెల్లిగా—'

'యెవరుకనిపించారు ఆయనకు...?'

'అంతావిను తొందరపడతావేం! యెవరోయిళ్ళకితిరిగి పెళ్ళి వేట్లు చెప్పుకునే పెళ్ళివేటుమాష్టరట. అతను తనభార్యా రెండు భుజాలపైనా రెండుచేతులూమోపి ముఖంలో ముఖంపెట్టి శృంగారం ఒలకపోస్తున్నాడట! అదృశ్యం ఆయనకంటపడిందిట. యీసంగతంతా నాతోచెప్పి యేంచెయ్యమంటావు అని నన్ను సలహాఅడిగాడు! చివరికి అటువంటి మిత్రునికి యెలాంటిభార్యా దొరికిందా అని నాకు యెంతో విచారంగావుంది—' తన సంగతిఅంతా భర్తకు తెలిసిపోయింది అనుకుంది. తనయెదుట తననిచెప్పలేక తంస్నేహితుడుభార్యా సంగతి అని యుక్తిగా

చెప్పుతున్నాడని పూర్తిగా గ్రహించింది.

'మీరేం సలహాయిచ్చారు మిత్రునికి?'

'అటువంటి సంగతులలో యెటూ చెప్పకూడదని వింటూవూరుకున్నాను. భర్తని, సంసారాన్ని అపకీర్తిపాలుజేసే భార్యలు భూభారం గాబట్టికి వుండేకంటే చస్తేనేమేలు అనుకున్నా నా మనసులో'

'సరేగాని మీరుచెప్పినవన్నీ బాగానేవున్నాయి! ఆయనగారి భార్యా వట్టిదుర్మార్గురాలే, చెడ్డబుద్ధిగలదే నప్పుకుందాం నేనుఒకమాట అంటాను మీమిత్రుణ్ణి అంటున్నానని మీకేం కోపంరాదుగదా?'

'చూస్తూ ఎందుకు వూరుకున్నాడనేనా నువ్వనేది'

'ఆమాటకాదు మీకేం కోపంలేదంటే చెపుతాను'

'చేసుకున్నవాళ్ళూ, అనుభవించేవాళ్ళూ వాళ్ళువుండగా మధ్య నీకూ, నాకూ యెందుకుకోపం'

'అరవై అయిదుయేళ్ళు పైకొచ్చి, ఇరవై అయిదేళ్ళపిల్లని యేవని చేసుకున్నాడండీ?'

'వండిపెట్టే దిక్కులేదుగదా అని చేసుకున్నాడు తప్పేమిటి?'

'వండిపెట్టే దిక్కులేకపోతే యేవంటలక్కనన్నా పెట్టుకుని గడుపుకోకూడదా?'

'యేమో యేం సౌఖ్యపడదామని చేసుకున్నాడో మనకేం తెలుస్తుంది చెప్పు కనకం?'

'ఊఁ! సౌఖ్యం! యిన్నేళ్ళు పైకొచ్చింతర్వాత ఇంకా సౌఖ్యపడేదేమిటి? తాను సౌఖ్యపడేటందుకూ కాదు ఆవిడనుసౌఖ్య పెట్టేందుకూ కాదు పాపం! ఆ సుకుమారి నూతన జీవితాన్ని మొదలంటా నాశనం చెయ్యదలుచుకొని పెళ్ళిచేసుకున్నాడు. ఆయవ్వనవతి జీవితం అంతా దుఃఖమయంచేశాడు. చేతులారా తప్పుడు పనులు చేసుకుని పిదప విచారిస్తేయేం ప్రయోజనం.'

'యింతకీ ఆతప్పు ఆయనదేనంటావా? కనకం'

'ఇంకా సందేహం యేమిటి! ముమ్మాటికీ ఆయనదే! ఆయనది కాక అవిడిది యెందుకవుతుంది. అరవై అయిదేండ్లువచ్చి యవ్వనవతిని, అందకత్తెనూ, మూడవపెండ్లి చేసుకుని, యింకా సౌఖ్యపడాలని ఆయనకే కోరికలు వుంటే ఇరువై అయిదేండ్ల యవ్వనవతికీ, సౌఖ్యమంటే యేమిటో సరిగా యెరగనిదానికే యింకెన్ని కోరికలు వుండాలిచెప్పండి!'

'బాగావుంది నీతీర్పు'

'పోనీలెండి లోకులసంసారల గొడవలు మనకెందుకు? అంది కనకం.

'అట్లాఅని వూరుకోరాదూ! తెలిసీతెలియని వాగుడువాగుతా వేదుకూ! బుద్ధిలేక.' అంటూ కోపంతో లేచి వెళ్ళిపోయాడులోపలికి లోకనాథంగారు. తానుతగ్గివూరుకుంది కనకం.

భర్తయింట్లోలేకుండాచూసి లోపిబోతూన్న రంగడినిచూసి నిమ్మదిగా-

'రంగనాయకులూ! ఒకసారి ఇలారా నాయనా!' అంది కనకం.

'ఎందుకండీ?'

'స్కూలుకి వెళుతున్నావా?'

'అవునండీ!'

'మీమేష్టరుగారితో నేను ఒకసారివచ్చి మాట్లాడి వెళ్ళమన్నానని చెపుతావ్'

'ఇప్పుడు రమ్మన్నారని చెప్పమన్నారా?'

'వీలుగావుంటే ఇప్పుడు రమ్మన్నానని చెప్పు లేకపోతే స్కూలు కైపము అయింతర్వాత రమ్మన్నానని చెప్పు'

'అలాగేనండి.'

'అబ్బాయీ! అయిదురూపాయలు తీసుకో'

'యెందుకు వద్దులెండి'

'ఫరవాలేదు తీసుకో. మేష్టారుగారు ఏమీ అనరులే!' అని రంగడిచేతులో అయిదురూపాయలు పెట్టింది. అయిదురూపాయలు తీసుకొని వెళ్ళిపోయాడు రంగడు.

'ఏం రంగా! పోనుపోను చదువుయందు శ్రద్ధ యింతఎక్కువై పోతోంది.' అన్నాడు కళాధరరావు

'మీపనిమీదే వెళ్ళి వచ్చానండి!'

'ఏమిటాపని?'

'కనకమ్మగారు నన్ను వస్తూంటే పిలిచారండి'

'ఎందుకూ!'

'ఎందుకో ఒకసారి మాట్లాడిపొమ్మని చెప్పమన్నారండి'

'అవసరంగా రమ్మన్నదా?'

'అవునండి ఏవైన పుస్తకాలు కొనుక్కోమని అయిదురూపాయలు తెచ్చియిచ్చారు...'

'పుస్తకాలూ కాగితాలూ కొనుక్కో'

'ఒద్దంటే వద్దన్నాను. ఆమె వినేట్లులేరు ఆమెకి కోపంవస్తుందేమోనని పుచ్చుకున్నాను'

'పుచ్చుకుంటే తప్పేమిటిలేరా! అలావద్దనకూడదు'

ఖాళీ అవటంచేత కనకం యింటికివచ్చాడు కళాధరరావు.

'ఏదో మాట్లాడాలని కబురు పంపావేమిటి? కనకం'

'చెవుతా కూర్చోండి తలుపువేసి వస్తాను' అనివెళ్ళింది.

'పిధిగదిలోవద్దు లోపలికిరండి'

'ఏం కనకం?'

'ఒద్దన్నాగా ఎందుకు చెప్పినోరండి!'

'ఊం...నీయిష్టం నేకాదన్నానా!' యిద్దరూకలసి లోపలికి వెళ్ళారు.

'వీధిగదిలో వద్దన్నావు ఎందుచేతకనకం?'

'మనబండారం అంతా బయటపడింది'

'యెలా బయటపడింది?'

'భగవంతుడికి తెలియాలి'

'నేను మీయింటికి నీకోసమై వస్తున్నానని తెలిసిందా?'

'ఆహా! అన్నీ తెలిశాయి'

'ఎవరికి తెలిశాయి'

'యింకెవరికి మావారికే తెలిసింది'

'లోకనాధంగారికే! కొంపములిగిందన్నమాట! లోకనాధంగారికి తెలిసినట్లుగా నీకెలా తెలిసింది! ఎవరన్నా చెప్పారా?'

'ఆయననోటివెంటే విన్నాను.'

'ఏమని'

'మీరేం గాబరాపడకండి ఆయనకు తెలిసినందువల్ల మనకివచ్చిన నష్టమేమీ లేదు'

'ఇంక నష్టం ఏమిటి కనకం పాపం! నావల్ల నీసిరిసంపదలతో తులతూగే కాపరం పోదూ!,

'ఇంతవరకు కాపరం బాగావుండేడిసిందికనకా! అయ్యో ఇప్పుడు అటువంటి కాపరం పోతోందే అని బెంగా అదీలేదు యిదిలేదు'

'అయినా ఆయనకి యెలా తెలిసిందికనకం?'

యేమో నాకు మటుకు ఏంతెలుస్తుంది చెప్పండి మీకెంత తెలుసో నాకూ అంతే తెలుసు'

ఆశ్చర్యంగా వుందే!,

'ఆయన యెంత వివరంగా చెప్పారనుకున్నారేమిటి?'

'.....................'

'ఆయన మననిగురించి చెప్పకుండా, ఆయనకి స్నేహితుడు అచ్యుతరామయ్య అని ఎవరో వున్నాడట ఆయనకూడా యీయన ఈడు

వాశెనట! రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నాడట. యిద్దరు పెళ్ళాలూ చని పోయారట. ఈయన పెళ్ళితో పాటుగానే మూడో పెళ్ళి చేసుకున్నాడట'

'ఈయనలాగా నాలుగో పెళ్లి చేసుకోలేదుకదా!'

'ఆ పెళ్ళాము సాయంత్రము అవగానే వాలుజెడవేసుకొని, పువ్వులూ, అవీ పెట్టుకొని వేశ్యకంటే యెక్కువగా అలంకరించుకొని వీధిగుమ్మం వదలకుండా నుంచుంటుందిట'

'ఏం నుంచుంటే తప్పేమిటికి?'

'ఆయన ఇదిమనకు తగదుఅని అనేకసారులు చెప్పినా వినేది కాదుట.'

'నీయెదట నిన్న అనలేక ఒకరిమీాద పెట్టి అనటం మొదలుపెట్టా డన్నమాట మనసంగతంతా!'

'ఆ...ఇప్పుడయినా తెలిసిందికదా మీాకు ఒకరోజున ఆయన బజారునుంచి వచ్చేటప్పటికి వీధితలుపులు గడియవేసివున్నాయట! గుమ్మంయెక్కగానే గుసగుసలు వినిపించాయట. తలుపుకొట్టకుండా పక్కగావుండి వున్నాడట. తరువాత కిటికీరెక్కల సందునుంచి చూశాడట.'

'యేం కనిపించింది ఆయనకి?'

'అంతావినరేం! ఆయనభార్యా గోడకుఆనుకొని నుంచుందిట. ఆమె రెండుభుజాలమీాదా రెండుచేతులూ మోపి, ముఖంలో ముఖంపెట్టి సరససల్లాపా లాడుతున్నాడట యెవరో పరాయి మొగాడు'

'అయిందానికి యేమిటిచేసేది! ముందుకర్తవ్యం ఆలోచించండి. జరిగినదంతా చెప్పానుగదామీాకు'

'నేనేం ఆలోచించను కనకం? నీవేఆలోచించు'

'మనం యిద్దరం స్వేచ్ఛగా యెక్కడికైనా వెళ్ళిపోయే వుపాయం ఆలోచించాలి'

'ఊం...! ఆలోచించుకనకం! యెక్కడికి వెళితే అక్కడికి నీ వెనక వచ్చేవాడినినేను.'

'ఇద్దరం కలసి యెవ్వారైనా లేచిపోవటం మంచిది'

'మంచిదే యెవ్వూరు పోదామంటావు చెప్పు?'

'మద్రాసు పోదాం'

'మద్రాసు ఎందుకు? బాపట్లపోదాం కనకం అక్కడ నన్ను ఎరుగున్న కుర్రవాళ్ళు చాలామంది వున్నారు.

'కొంతసొమ్ము నేను తీసుకువస్తాను రేపే బయల్దేరుదాం రేపు ఈ పాటికి ప్రయాణమై రావాలిమీరు నాకు ఇక్కడ వక్కతెను వుండటం ఇష్టంలేకుండావుంది'

'ఆల్ రైట్ తప్పకవస్తాను నువ్వు ప్రయాణమైవుండు' అని చెప్పి వెళ్ళిపోయాడు కళాధరరావు.

కళాధరరావు బండివానిని పిలచి అతని చేతికి ఒకవుత్తరం యిచ్చాడు, కనకాని కిమ్మనమని'.

'నా ప్రియమైన కనకానికి—'

'నేను ప్రయాణమై బయలుదేరాను. నీవు ఈబండిలో రావలసింది. యిద్దరం రైలుస్టేషనువద్ద కలుసుకుందాం. రైలుటైముకు ఒక అరగంట ముందుగా అక్కడ వుండటం మంచిది. ఈవుత్తరం చూసుకొన్నవెంటనే బయలుదేరి రావలసింది' అని చదివింది. యింట్లోపనిచేసే పేరిగాడితో మాపుట్టింటిదగ్గరనుంచి వుత్తరం వచ్చింది. నేనుఅవసరంగా వెళుతున్నాను. నువ్వు అయ్యగారువచ్చేవరకూ ఇంట్లో వుండుమని చెప్పి సూటుకేసు ఒకటి బండిలోపెట్టుకొని రైలుకి వెళ్ళిపోయింది కనకం. రైలుస్టేషనుదగ్గర కనకంకోసం చూస్తూ నుంచున్నాడు కళాధరరావు. స్టేషనుదగ్గర ఇద్దరూ కలుసుకొని రైలు ఎక్కారు.

నిప్పులు చెరుగుతూ బాపట్లస్టేషన్ సమీపించింది రైలు. బాపట్లలో దిగారు కళాధరరావూ, కనకం. అన్నిసదుపాయాలూ కలిగిన

యిల్లు ఒకటి అద్దెకు తీసుకుని కాపరం స్థిరపరచుకున్నారు. రోజులు గడుస్తున్నాయి నిమ్మదినిమ్మదిగా యెలాగో తంటాలుపడి నాలుగైదు ట్యూషన్లు చూసుకున్నాడు కళాధరరావు. కళాధరరావుతో కలిసి సుఖవంతంగా కాలం గడుపుతోంది కనకం కనకం గర్భిణితో వుంది.

‚కనకం! కాలం యెంత విచిత్రమైందో చూశావా?'

‚యేం విచిత్రం జరిగింది యిప్పుడు?'

మనం యిట్లా వచ్చేశాంగదా లోకనాధంగారు యేమనుకుంటారేమిటి?'

‚ఆయనకు తెలియదంటారా ఈసంగతి'

‚తెలుస్తేమటుకేం'

కొద్దిరోజులు వరకూ తెలియకుండా వున్నాయి తరువాత ఏనా క్రమంగా తెలుస్తుంది. తెలియకుండా మానదు కనకం'

'మాటవరసకి అంటున్నా కనకం'

‚కాస్సేపు చదువుకుని వస్తారా?'

‚ఇంట్లోపని అంతా అయిపోయిందా?'

'ఆ...అయిపోయింది. యెంతసేపేమిటి?'

‚అయితే వీధి తలుపులు వెయ్యి వెళ్లిపోదాం'

‚యేదో చదువుకుంటున్నారుగా చదువుకోండి! పగలు మీకు తీరిక వుండదు'

‚పగలంతా వాగి, వాగి వుండటంచేత రాత్రిఅవగానే హృదయం సౌఖ్యం కోరుతుంది కనకం. ఆమాత్రం సుఖంలేకపోతే ఇంకేమిటి;

‚యెప్పటికప్పుడే పరగడుపుమీకు!'

‚టైము ఎంత అయిందోచూడు?'

‚పది అవస్తోందండి'

ఎన్నాళ్ళు ఇలాజరిగినా మీకు ఇంకా దిష్టతనం పోదు'

'అహా! అలానా'

'నిద్రవస్తోంది'

'పడుకోండి నేను వస్తున్నానా!'

'నువ్వు నాయెదటవున్నంతకాలం నాకు చిన్నతనంబుద్ధులు పోవు'

కనకానికి కనేనెలలు వచ్చాయి. ప్రసవించింది. ఆడపిల్ల కలిగింది. తొట్టెలో పడుకుని పాలపీకి చీకుతూ కాళ్ళూ చేతులూ ఆడిస్తూ చిటిక లేస్తూ తొట్టిదగ్గర నుంచున్నాడు. కళాధరరావు. కళాధరరావు పిల్లను ఆడించటం చూసి లోపలినుంచి వచ్చింది కనకం.

'మీపోలికే చూశారా?'

'నాపోలిక యేంకాదు నీపోలికయే కనకం!

'సరిగా చూడండి'

'చాల్లే ఇహావూరికో స్పష్టంగా నీముఖమే'

'అమ్మాయికి పేరు ఏం పెడతారో ఆలోచించండి?'

'కష్టపడి కన్నదానివి నువ్వే ఆలోచించు'

'కష్టం అంతా మీదే నాదేముంది...ఆలోచించుకోండి బాగా-'

'పోనీ మనయిద్దరి కష్టానికీ ఫలితం అనుకో సరేనా!'

'అలా అనండి వొప్పుకుంటాను'

'అమ్మాయికి 'సుగుణ' అని పేరుపెడదాం'

అంటూ, సుగుణా! అని ముద్దుపెట్టుకున్నాడు కళాధరరావు.

ఇప్పుడు సుగుణ ఏజాతికి చెందింది? తండ్రిది ఒకకులం తల్లిది మరొకకులం అయితే సుగుణను ఎవరు పెండ్లిచేసుకుంటారు? సుగుణ జీవితం ఏవిధంగా పరిణమించేది తరువాయి 'బ్రాందీబాటిల్' నవలలో చదివితేనేగాని మీకేం తెలుస్తుంది?

సంపూర్ణము.

వాకప్ప ప్రెస్, రాజమండ్రి.

# రాబోవు కొత్త నవలలు

1 పాషాణము

2 పౌర్ణమి

## జీవితచరిత్రలు.

1 రాజగోపాలాచారి

2 ఆజాద్

3 చిత్తరంజన్ దాస్

4 పటేలు బ్రదర్సు

5 నవాబ్ జిన్నా

వలయువారు:—

పసుపులేటి బాపిరాజు

రాజమండ్రి.

టైటిలు పేజీ మాత్రము శ్రీ చింతామణి ప్రెస్, రాజమండ్రి.